దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 129.00 ఎయిర్‌మెయిల్ ద్వారా: రూ. 276.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 135.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 276.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

# Chelpark

## A class by itself!










**CHELPARK COMPANY PVT. LTD.**

A-93, Industrial Estate, Rajajinagar, Bangalore - 560 044.

**Ph : 335 1694, 335 1562 Fax : 3300021**

**CHELPARK RANGE OF PRODUCTS**

INKS, WAX CRAYONS, WATER COLOUR CAKES, PENS, PENCIL, OIL PASTELS, ADHESIVES, STAMP PAD BOX, WATER COLOUR SET ETC.



# చందమామ

జూన్ 1997






విడిప్రతి : **6.00**

సంవత్సర చందా : **72.00**




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి

## అందరికీ విద్య!

జూన్ నెల రాగానే నూతన విద్యాసంవత్సరం ఆరంభమవుతుంది. పిల్లలను బడులలో చేర్పించడానికి తల్లితండ్రులు నానా తిప్పలు పడుతూంటారు. వేసవి సెలవులకు ముందే అడ్మిషన్లు పూర్తిచేసే పాఠశాలలూ ఉన్నాయి. ఇది నాణానికి ఒకవైపు. మరొకవైపు బడి అంటే ఏమిటో తెలియని పిల్లలూ ఉన్నారు. హొటళ్ళలో, పరిశ్రమలలో, పొలాల మధ్య కాయకష్టంచేస్తేతప్ప కడుపునింపుకోలేని దౌర్భాగ్యస్థితిలో లక్షలాది మంది పిల్లలు అలమటిస్తున్నారు!

మనకు స్వాతంత్ర్యం వచ్చి యాభైయేళ్ళు నిండాయి. పద్నాలుగేళ్ళ లోపు పిల్లలందరికీ ఉచిత నిర్బంధ విద్య నేర్పాలని మన రాజ్యాంగం పేర్కొంటున్నది. అయినా, దీనిని ఇంతవరకు ఆచరణలో అమలు చేయలేకపోతున్నాం. విద్యను అందరికీ ప్రాథమిక హక్కుగా ప్రకటించాలని ప్రస్తుతం పాలకులు అభిప్రాయపడుతున్నారు!

ఏదిఏమైనా ఈ దేశంలో పుట్టే పిల్లలందరూ పనులకు పోకుండా ఇంత తిండికీ, బట్టకూ ఆరోగ్య రక్షణకూ నోచుకున్నప్పుడే 'అందరికీ విద్య' అన్న ఆశయం నెరవేరుతుంది. అంత వరకు అది కేవలం పగటికలగానే మిగిలి పోతుంది. కాబట్టి దారిద్ర్య బాధ నుంచి బయట పడడానికి ప్రజలు పాటుపడాలి. పేదలఆర్థికాభివృద్ధికి ప్రభుత్వం దారిచూపాలి. అప్పుడే 'అందరికీవిద్య' అన్న కల నిజమవుతుంది!

సంపుటి : **100**    జూన్ **'97**    సంచిక : **6**
విడిప్రతి : **6.00**    సంవత్సర చందా : **72.00**




చందమామ
CHANDAMAMA
DECEMBER 1991

## వార్తలు – విశేషాలు:
# బ్రిటన్‌కు నూతన ప్రధాని

స్కాట్‌ల్యాండ్‌కు చెందిన ఒక పద్నాలుగేళ్ళ కుర్రాడు, తను చదువుతూన్న పబ్లిక్‌స్కూల్ కఠినమైనక్రమశిక్షణను తట్టుకోలేక ఇల్లువదిలి వెస్ట్ ఇండీస్‌లోని బహమాస్‌కు పారిపోవాలనుకున్నాడు. కాని అది సాగలేదు. ఇది ముప్ఫైయేళ్ళ నాటి మాట. ఇప్పుడా కుర్రాడు బ్రిటిష్ ప్రధాన మంత్రిగా నెం. 10, డౌనింగ్ వీధిలో నివసిస్తున్నాడు!

ఆయన పేరు టోనీ బ్లెయిర్ అని గ్రహించే ఉంటారు. మే 1వ తేదీ జరిగిన సాధారణ ఎన్నికలలో టోనీ బ్లెయిర్ నాయకత్వం వహించిన లేబర్ పార్టీ ఘనవిజయం సాధించి, పాలక పక్షమైన కన్సర్వేటివ్ పార్టీని ఓడించి అధికారం చేపట్టింది. 659 స్థానాలు గల హౌస్ ఆఫ్ కామన్స్‌లో లేబర్ పార్టీకి 419 స్థానాలు, అంతవరకు అధికారంలో ఉన్న కన్సర్వేటివ్ పార్టీకి 163 స్థానాలు, లిబరల్ డెమోక్రాట్స్‌కు 45 స్థానాలు లభించాయి. మిగిలిన స్థానాలను మరికొన్ని జాతీయ పార్టీలు, ఇండిపెండెంట్ అభ్యర్థులు గెలుచుకున్నారు.



కన్సర్వేటివ్ పార్టీ సభ్యులైన స్కాటిష్ తల్లి దండ్రులకు టోనీబ్లెయిర్ 1953వ సం॥లో జన్మించాడు. స్కూలు చదువు ముగించాక ఆయన న్యాయశాస్త్రం అభ్యసించడానికి ఆక్స్‌ఫర్ట్ విశ్వవిద్యాలయానికి వెళ్ళాడు. సెయింట్ జాన్స్ కాలేజ్ ఆయన ఆలోచనా విధానంలో మార్పు తెచ్చి ఆయన దృక్పథ పరిధిని విస్తృతం చేసింది. ఉపాధ్యాయుల,తోటి విద్యార్థుల భావాలు ఆయన్ను ప్రభావితం చేశాయి. ఆయన సోషలిస్టు భావాలచేత ఆకర్షించ బడ్డాడు. అదే ఆయన లేబర్‌పార్టీలో చేరడానికి దోహదం చేసింది. ఆయన ట్రేడ్ యూనియన్ చట్టంలో ఉత్తమ శ్రేణిలో పట్టభద్రుడయ్యాడు. రాజకీయ రంగంలో ప్రవేశించడానికి ముందు ఆయన కొంతకాలం న్యాయవాదిగా పనిచేశాడు.

1983వ సం॥లో ఆయన లేబర్ పార్టీ తరపున హౌస్ ఆఫ్ కామన్స్‌లో ప్రవేశించాడు. అప్పటికి అతిపిన్న వయస్కుడైన పార్లమెంటు సభ్యుడాయన. 1992వ సం॥లో లేబర్‌పార్టీ 'షాడో క్యాబినెట్'ను ఏర్పాటు చేసినప్పుడు టోనీ శాంతిభద్రతల శాఖను నిర్వహించాడు. ఆ తరవాత ఆయన పార్టీ జాతీయ నిర్వాహక కమిటీ సభ్యుడయ్యాడు. 1994వ సం॥లో ఆయన లేబర్‌పార్టీ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. 1906వ సం॥లో స్థాపించబడిన లేబర్‌పార్టీకి ఆయన 20వ అధ్యక్షుడయ్యాడు. సాధారణ ఎన్నికలకు ముందు జరిపిన అభిప్రాయ సేకర ణలో 61 శాతం మంది ఆయన్ను ప్రధాన మంత్రిగా ఎన్నుకున్నారు. జాన్ మేజర్‌కు 21 శాతం ఓట్లు లభించాయి.

అయినప్పటికీ లేబర్ పార్టీ సాధించిన ఘన విజయం, టోనీ బ్లెయిర్ సైతం ఊహించనిది. తమ పార్టీ విజయం సాధించగలదనుకున్నారే తప్ప, పాలక పక్షమైన కన్సరేటివ్ పార్టీకి ఇంతటి వ్యతిరేకత ఉండగలదని ఎవరూ ఊహించలేకపోయారు.

విజయం ఖాయం అన్న సంగతి తెలిశాక, తమ ఇంటి ముందు జరిగిన ఊరేగింపును ఉద్దేశించి టోనీబ్లెయిర్, "మన దేశంలో నవోదయం ఆరంభమయింది. కొన్ని ముఖ్యమైన రంగాలలో విశేషంగా కృషి చేయాలి. ముఖ్యంగా మన పిల్లందరికీ విద్య, సంక్షేమ పథకాలను ఆధునికం చేయడం, సరైన జాతీయ ఆరోగ్య పరిరక్షణకు వసతులు కల్పించడం మొదలైన వాటిపై మన దృష్టిని కేంద్రీకరించాలి," అన్నాడు.

43 సంవత్సరాల వయసు గల టోనీబ్లెయిర్ ఈ శతాబ్దంలో అతిపిన్న వయస్కుడైన బ్రిటిష్ ప్రధానమంత్రి అన్న విశిష్టతను సంతరించుకున్నాడు. 1812 వ సం॥లో లార్డ్ లివర్‌పూల్ 42వ యేట బ్రిటన్‌కు ప్రధానమంత్రి అయ్యాడు!



# కుముదుడి సలహాలు

కుందనపురానికి కుముదుడు కొత్తగా వచ్చాడు. అతడికి పొరుగున వుండే ప్రదీపుడికి నిదానస్థుడనీ, తెలివైనవాడనీ పేరు. అతడికీ కుముదుడిలాగే పెద్ద మండువా ఇల్లూ, పదెకరాల పొలం, అనుకూలవతి అయిన భార్యా, ఒక కొడుకూ, కూతురూ, లక్షరూపాయల నిల్వా వుండడమే కాదు, ఇద్దరూ సమ వయస్కులు.

వచ్చిన తొలిరోజునే కుముదుడు, ప్రదీపుణ్ణి కలుసుకుని, "నీ గురించి విని నీ పొరుగుకు వచ్చాను. ఈ ఊళ్ళో స్థిర పడ్డానికి నాకు నీ సలహాలు కావాలి," అన్నాడు.

ప్రదీపుడు నవ్వి, " నేనెవరికీ సలహాలివ్వ గూడదని ఒట్టుపెట్టుకున్నాను. ఏమీ అనుకోకు. సలహాలు లేకపోయినా మనం స్నేహంగా వుండవచ్చు," అన్నాడు.

కుముదుడు కూడా నవ్వి, "సలహాలు లేకుండా స్నేహంకుదరదు. నువ్వు నాకు సలహాలివ్వకపోతే, నేను నీకు సలహాలిస్తాను, సరేనా?" అన్నాడు.

"నాకు ఎవరి సలహాలూ నచ్చవు. ఒకరి సలహాలు నచ్చవు కాబట్టే, నేనూ ఇతరులకు సలహాలివ్వకూడదని ఒట్టు పెట్టుకున్నాను.నువ్వు నాకు సలహాలివ్వడం ప్రయోజనంలేని పని. తెలివైనవాడు ప్రయోజనంలేని పనికి పూనుకోడు," అంటూ ప్రదీపుడు, కుముదుణ్ణి హెచ్చరించాడు.

"నేను నీకు సలహాలిస్తాను. నీ అభిప్రాయంతప్పనిఋజువుచేస్తాను," అన్నాడు కుముదుడు సవాలు చేస్తున్నట్లు.

అప్పటికి ప్రదీపుడు చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

ఆ తర్వాత ఒక రోజున వాళ్ళిద్దరూ కలుసుకున్నప్పుడు కుముదుడు, ప్రదీపు

జొన్నలగడ్డ రామలక్ష్మి

డితో, "లక్షరూపాయలు నిల్వవుంది కదా! తెలివైనవాడివి, వడ్డీవ్యాపారంచేసి డబ్బును పెంచుకో," అని సలహా ఇచ్చాడు.

"అప్పు తీసుకున్నవాళ్ళకు ఎన్నో ఇబ్బందులుంటాయి. అందువల్ల, వాళ్ళు అన్న ప్రకారం అప్పులు తీర్చలేరు. వాళ్ళ మీద జాలిపడితే, అది అలుసుగా తీసుకుని కొందరు మోసం చేస్తారు. అందుకే వడ్డీ వ్యాపారంచేసి డబ్బు సంపాయించాలంటే జాలి, దయాగుణం వుండకూడదు. కర్కోటకంగా వ్యవహరించాలి.అది నాకు చేత కాదు. కాబట్టి భారీనష్టం తప్పదు,"అంటూ ప్రదీపుడా సలహాను త్రోసిపుచ్చాడు.



కొన్నాళ్ళూరుకుని కుముదుడు, ప్రదీపుడికింకొక సలహా ఇచ్చాడు: "నీ కొడుకు బాగా చదువుకున్నాడుకదా! వాడికిపట్నంలో మంచి ఉద్యోగం వస్తుంది. వాణ్ణక్కడికి పంపు.నీ కూతురు కోసం ఇల్లరికపుటల్లుణ్ణి తెచ్చుకో. వాడు వ్యవసాయం చూస్తాడు. వృద్ధాప్యంలో కొడుకుపంచన కోడలి సంరక్షణలో వుండాల్సిన అవస్థ తప్పుతుంది. కన్నకూతురు తల్లిదండ్రుల్ని కంటికి రెప్పలా చూసుకుంటుంది."

ఈ సలహాకూడా ప్రదీపుడికి నచ్చలేదు. అదేమని అడిగితే, "భార్యాభర్తలు అరమరికలు లేకుండా కలిసిమెలిసి జీవిస్తేనే, ఆ దాంపత్యం బాగుంటుంది, రాణిస్తుంది. తలిదండ్రులవద్ద వున్నంతకాలం ఆడపిల్ల భర్తను పరాయివాడిగా చూస్తుంది తప్ప, తనవాడనుకోదు. అమ్మాయి అత్తింట వుండడమే మంచి సంప్రదాయం.నాకు తెలిసి–ఇల్లరికపుటల్లుణ్ణి తెచ్చుకున్న వారెవరూ సుఖపడలేదు. ఇక కోడలి సంగతంటావా, పరాయి ఇంటిపిల్ల మనలో కలిసిపోవడాని కొచ్చిందన్న జ్ఞానం మనకుంటే, గొడవలన్నవి రానేరావు," అంటూ వ్యాఖ్యానించాడు.

మరికొన్నాళ్ళు గడిచాయి. ఆ ప్రాంతాలలో బందిపోట్ల బెడద వచ్చింది. ఉన్నట్టుండి బందిపోటు దొంగలు ఏదో ఒక గ్రామం ప్రవేశించి దోచుకుని వెళ్ళిపోతున్నారు.రాజభటులకు సమాచారం అందేలోగా అంతా ముగిసిపోతున్నది. ఆ కారణం వల్ల, ప్రతి గ్రామంలోనూ యువకులందరూ కట్టుగా చేరి సైనికశిక్షణ పొంది, ఆయుధధారులై గ్రామాల సంరక్షణకు పూనుకున్నారు. అయినా బందిపోట్ల ముఠాలు దాడిచేస్తూనేవున్నాయి. కొన్నిచోట్ల గ్రామ



మరికొన్ని రోజులు గడిచాయి. జమీం దారు రంగరాయుడితల్లికి పెద్ద జబ్బు చేసి చచ్చిపోతుందనుకున్నారు. కానీ ఆవిడకు పూర్తిగా నయమై సంపూర్ణా రోగ్యవంతురాలైంది. త్వరలో ఆమెకు డెబ్బైఅయిదు సంవత్సరాలునిండుతాయి. ఆ సందర్భంగా రంగరాయుడు పెద్ద ఎత్తున వేడుకలు తలపెట్టాడు. ఆ వేడుక లకు చుట్టుపక్కల గ్రామాల వారందర్నీ ఆహ్వానించాడు. అతిథి మర్యాదలకు చక్కని ఏర్పాట్లు చేయించాడు. కాలినడ కనవచ్చే వారికోసం చలువ పందిళ్ళు వేయించాడు. ఎడ్లబళ్ళ మీద వచ్చేవారి కోసం ఉచిత వసతి సౌకర్యం ఏర్పాటు చేశాడు. గుర్రపుబళ్ళ మీద వచ్చేవారికి ప్రత్యేక వసతి సదుపాయం వుంది.

ఇదివిన్న కుముదుడు, ప్రదీపుణ్ణి కలుసు కుని, "నువ్వు చాలా తెలివైనవాడివి. జమీం దారుకు చేరికైతే నీ తెలివికి రాణింపూ, గుర్తింపూ వుంటుంది. ఒక గుర్రబ్బండి కొను. అందులో వేడుకలకు వెళ్ళు. ప్రత్యేక సత్కారం పొందు. తిరిగి వచ్చాక గుర్రపుబండిని రవాణా సాధనంగా ఉప యోగించి, డబ్బు సంపాదించవచ్చు," అన్నాడు.

దీనికి ప్రదీపుడు నవ్వి, "జమీందారు అతిథులను హోదాను బట్టే గౌరవిస్తున్నాడు కాబట్టి, ఆయనకుతెలివితోనిమిత్తం లేదు. గుర్రబ్బండితో నా హోదానుపెంచుకుంటే, ఆ హోదాకు తగ్గ కానుకలుకూడా ఇచ్చు కోవాలి. రాజుల స్నేహం కత్తి మీద సాము వంటిది. వారికి దూరంగా వుండడమే నా

స్థులు విజయం సాధిస్తే, మరికొన్ని చోట్ల బందిపోట్లు విజయం సాధిస్తున్నారు.

ఎప్పటిలాగే కుముదుడు, ప్రదీపుడికి సలహాయిస్తూ, "డబ్బంతా ఇనప్పెట్టెలో వుంటే దొంగలు దోచుకుపోతారు. వాళ్ళ ప్రమాదం తగ్గేదాకా డబ్బు, నగలు పెరట్లో పాతిపెట్టడం మంచిది," అన్నాడు.

ఈ సలహాను కూడా ప్రదీపుడు త్రోసి పుచ్చుతూ, "ఉన్నదంతా పెరట్లోపాతిపెడితే, ఇనప్పెట్టె ఖాళీగా వుంటుంది. దొంగలు అనుమానించి చావతన్ని మనచేత నిజం కక్కిస్తారు. నీ సలహా బాగోలేదు," అన్నాడు.

"అయితే ఏం చేయాలీ?" అన్నాడు కుముదుడు.

"నేనేం చేస్తానో నీకు చెప్పను. నువ్వేం చేశావని నిన్నడగను," అన్నాడు ప్రదీపుడు.

కిష్టం. అసలంటూ వెళ్ళక పోతే, ఆహ్వానాన్ని మన్నించలేదని చెడ్డపేరు. కాబట్టి కాలినడకనవెళ్ళి, ఏగుర్తింపూ పొందకుండా జమీందారు వేడుకల్లో పాల్గొనివస్తాను. గుర్రబ్బండితో వ్యాపారమంటావా, నేను వ్యవసాయదారుణ్ణి. వ్యాపారం నాకు చేతకాదు," అంటూ ఆ సలహానూ త్రోసిపుచ్చాడు.

"మరికాలినడకన వెళితే మనకు ఫరవాలేదు. కానీ మన ఆడవాళ్ళెలా నడుస్తారు? నీ తెలివి తెల్లారినట్లే వుంది," అన్నాడు కుముదుడు చిరాగ్గా.

"నీ సంగతి నాకుతెలియదు. కానీ ఈ విషయంలో నేను, నీ సలహా ఏమాత్రం పాటించను. జమీందారువేడుకలకు నేనొక్కడినేవెళతాను. నా కుటుంబాన్నితీసుకుని వెళ్ళను," అన్నాడు ప్రదీపుడు తనూచిరాగ్గా.

కుముదుడు ఒక క్షణం ఆగి, "ఇరుగు పొరుగున వుంటున్నాం. కొన్ని విషయాల్లోనైనా కలిసిమెలిసి వుండాలి. నేను వేడుకలకు నాభార్యనూ, పిల్లల్నీతీసుకుని వెళదామనుకున్నాను. మీ వాళ్ళు రాకపోతే, మా వాళ్ళూ రానంటారు.నాకు నీతో రాక తప్పదు," అని చాలా నిష్ఠూరమాడి వెళ్ళిపోయాడు.

అనుకున్నరోజుకు కుముదుడు, ప్రదీపుడు జమీందారుండే ఊరుకు వెళ్ళి, వేడుకల్లో పాల్గొని వచ్చారు. జనం బాగా ఎక్కువగా వెళ్ళడంవల్ల, ఊరంతా తొడతొక్కిడి అయింది. వచ్చిన ఆడవాళ్ళకుచాలా ఇబ్బందయింది. కొందరికి జనం తోపిడిలో దెబ్బలు తగిలీ, కొందరికి రోగాలొచ్చీపట్నం తరలించాల్సి వస్తే, అందుకు అతిథుల



గుర్రబ్బళ్ళనూ, ఎడ్లబళ్ళనూ వాడుకోవడం జరిగింది. అతిథి మర్యాద కంటే, అతిథుల వల్ల జమీందారుకు లభించిన కానుకలు ఎక్కువనిపించాయి.

అక్కడ వుండడం ఇబ్బందనిపించి, అనుకున్నదానికంటే, కాస్త ముందుగానే కుముదుడు, ప్రదీపుడు తిరుగు ప్రయాణం కట్టి అర్ధరాత్రివేళకు కుందనపురం చేరుకున్నారు.

ఆ సమయంలో కుందనపురం గగ్గోలుగావుంది. ఊళ్ళోకి బందిపోటు దొంగలు చడీ చప్పుడూ లేకుండా ప్రవేశించారట! ఒక ఇంటికి వెళ్ళి ఇనప్పెట్టె తలుపులు తెరిచి, అందులో ఏమీలేదని ఉక్రోషం వచ్చి ఇంటిల్లపాదినీ చావబాదారట. అక్కణ్ణించి కుముదుడి ఇంట్లో ప్రవేశించారట.

అతడి ఇనప్పెట్టెలోంచి పదివేల రూపా యలూ, రెండుతులాల బంగారం దోచు కుని బయటపడుతూ యువసేన కళ్ళ బడ్డారు. వాళ్ళు బందిపోట్లను బంధించి కుముదుడి సొమ్ము అతడింట్లో అంద జేశారు. బందిపోట్లు పడ్డ మొదటి ఇంట్లో వాళ్ళ పరిస్థితి చాలా ప్రమాదకరంగావుంది. అందరికీ వైద్యచికిత్స జరుగుతున్నది.

ఇదంతా విని, "నువ్వు చాలా అదృష్ట వంతుడివి!" అన్నాడు ప్రదీపుడు, కుము దుడితో.

"నాది అదృష్టం కాదు, తెలివి!" అన్నాడు కుముదుడు గొప్పగా.

"ఏం తెలివో మరి! నీ తెలివంతా ప్రయోజనంలేని పనులకే వృధా అయిపో తున్నది. నాకు సలహాలివ్వడం మానేవరకూ, నీ తెలివిని నేనొప్పుకోను. నీకు జరిగిన మేలు, నీ అదృష్టం మాత్రమే!" అన్నాడు ప్రదీపుడు.

ఇందుకు కుముదుడు చిరునవ్వునవ్వి, "నీకు సలహాలివ్వడంలోనే నా ప్రయోజన ముంది. నేను నీకు సలహాలి స్తున్నానని నువ్వనుకున్నావు. కానీ నిజానికి నేను,నిన్ను ఒక కొత్తపద్ధతిలో సలహాలడిగాను. నాకు వడ్డీ వ్యాపారం చేయాలనిపించింది. నువ్వు వద్దన్నావు. ఇల్లరికపుటల్లుణ్ణి తెచ్చుకుందా మనుకున్నాను. వద్దన్నావు. దొంగల నుంచి ప్రమాదంలేకుండా డబ్బెలాదాచాలో నువ్వే చెప్పావు. జమీందారువేడుకల విషయం లోనూ, నేను నీ సలహానే పాటించాను. నేను నీకు సలహా యిస్తున్నాననుకున్నావే తప్ప, నీ సలహా తీసుకుంటున్నానని నువ్వనుకోలేదు. అది నా తెలివికాదా?" అని అడిగాడు.

ప్రదీపుడు తెల్లబోయి, "నువ్వు నిజంగా తెలివైనవాడివి. నాకు తెలియకుండా నా నుంచి సలహాలు రాబట్టుకున్నావు. అంతే కాదు, నా సలహాలవల్ల ప్రయోజనముం దనీ ఋజువు చేశావు. ఇక మీదటనువ్వు సూటిగా అడిగినా సలహాలిస్తాను. ఎందు కంటే–నా సలహాలు ఇతరులకు పనికొస్తా యన్న నమ్మకం నాకిప్పుడు కలిగింది," అన్నాడు.

ఆ తర్వాత ఎన్నో ఏళ్ళు కుముదుడు, ప్రదీపుడు మంచి ఇరుగుపొరుగులుగా జీవించారు.





# అవినీతిరాజ్యం

భూపాళదేశంలోఅవినీతి పెరిగిపోయింది. రాజోద్యోగులందరూ లంచగొండులై పోయారు. లంచం ఇవ్వనిదే ఏ పనీ జరగని పరిస్థితి ఏర్పడింది. వేగుల ద్వారా సమాచారం తెలుసుకున్న రాజు, మంత్రిని పిలిపించి, ఈవిషయమై సమాలోచన జరిపాడు.

"మహామంత్రీ! ఈ విషయం విన్నప్పటి నుంచీ, నా మనసు ఆందోళనతో తపించుకుపోతున్నది. మీరేం చేసినా సరే — ఈ అవినీతి రక్కసిని మనదేశం నుంచి పారదోలాలి. ఇందుకు మీకు పక్షం రోజులు గడువిస్తున్నాను!" అంటూ ఆజ్ఞలు జారీ చేశాడు రాజు.

రాజు పెట్టిన పక్షం రోజుల గడువు, మంత్రిని బెంబేలెత్తించింది. ఆయన వెంటనే నగరంలోని రాజోద్యోగులందరినీ సమావేశపరిచాడు. వాళ్లు, భూపాళదేశంలో అవినీతా? అంటూ ఆశ్చర్యం నటించి, అవినీతిపరులైన లంచగొండుల్ని అంత మొందిస్తామని శపథం చేశారు.

ఈ శపథం మాట గుర్తున్నా, మర్నాటి నుంచీ మళ్ళీ మామూలుగానే లంచాలు పట్టసాగారు. రక్తం రుచి మరిగిన పులిలా, లంచాలు మరిగిన ఉద్యోగులు తమ అలవాటు మానుకోలేకపోతున్నారు.

ఈ జరుగుతున్నదాన్ని గురించి, నమ్మకస్థులైన తన ఇంటి నౌకర్ల ద్వారా తెలుసుకున్న మంత్రి, రాజప్రాసాదం నుంచి తిరిగి వచ్చి తలపట్టుకుని ఆసనం మీద కూర్చున్నాడు.

ఆయన ఆందోళనకు కారణమడిగింది భార్య. మంత్రి ఆమెకు రాజ్యంలోని అవినీతీ, రాజుగారి ఆజ్ఞాగురించి చెప్పి, "రాజుగారిచ్చిన గడువు రెండురోజుల్లో ముగుస్తుంది. అవినీతి మామూలుగానే కొనసాగిపోతున్నది. ఉద్యోగులందరూ అవినీతి రాక్ష

ఇంద్రగంటి నరసింహమూర్తి

సిని తరిమి కొడతామంటూ శపథాలు చేశారు. అన్నీ దొంగశపథాలు!" అన్నాడు.

మంత్రిభార్య కొద్దిసేపు ఆలోచిస్తూవూరుకుని, తర్వాత చిన్నగానవ్వి, "అయ్యో, ఈ మాత్రానికేనా మీరింతగా దిగులుపడి పోతున్నారు! మీ జటిల సమస్యకు, ఇదండీ తిరుగులేని పరిష్కారం," అంటూ ఏం చేయాలో భర్తకు చెప్పింది. మంత్రి,భార్య చెప్పిన పరిష్కారసూచన విషయం దీర్ఘంగా ఆలోచించాడు. ఆ పరిస్థితుల్లో అంతకన్న సులువైనమార్గం ఆయనకు కనిపించలేదు.

గడువు ముగిసిన మర్నాడు రాజు, మంత్రిని పిలిచి అభినందించి, "పక్షం రోజుల్లో దేశంలో కరుడుకట్టుకుపోయిన అవినీతినిప్రక్షాళనం చేసేశారు. ఇది అల నాటి మహామంత్రులకు మాత్రమే సాధ్యమైన కార్యం. రేపు నిండుసభలో మిమ్మల్ని దేశరత్న బిరుదుతో సత్కరించబోతున్నాను," అన్నాడు.

మంత్రి మహోత్సాహంతో తిరిగి వచ్చి, భార్యకు కృతజ్ఞతలు చెప్పి, "సమయానికి సంజీవనివంటి ఉపాయంచెప్పావు.నువ్వు చెప్పినట్టే, రాజుగారికి వార్తలందించే వేగులకు ఘనంగా లంచంముట్టజెప్పి, ఆయనకు తప్పుడువార్తలందించేలా చేశాను. అవి విని రాజుగారు, ఉద్యోగులందరూ వాయు, మనోవేగాల్లో నీతిపరులై పోయారనుకుంటున్నాడు. వేగులకిచ్చిన లంచం, నాకింది ఉద్యోగి దగ్గర వసూలు చేశాను. ఆయన తనకింది ఉద్యోగిదగ్గర పట్టేసి వుంటాడు!" అన్నాడు.

"అసలు దేశంలో ఇంత అవినీతి ఎందుకు ప్రబలిందో ఎప్పుడైనా మీరాలోచించారా?"అని ప్రశ్నించింది మంత్రిభార్య.

నువ్వే చెప్పమన్నట్టు చూశాడు, మంత్రి. అప్పుడామె, "అవినీతి రక్కసికి బహుముఖాలు. రాజనీతి అంటే ఏమిటో తెలియని వాడూ, పరిపాలనాదక్షత లేనివాడూ రాజుగా గద్దె ఎక్కడం కూడా అవినీతే! అందువల్లనే, దేశంలో అవినీతిరక్కసి స్వేచ్ఛావిహారం చేస్తున్నది!" అన్నది.

మంత్రి, భార్యకు బదులు చెప్పలేకపోయాడు. ఏదిఏమైనా – భూపాళదేశంలో ప్రజలందరూ అవినీతికి అలవాటు పడిపోయారు. లంచం ఇవ్వడం, పుచ్చుకోవడం అతి సాధారణ విషయమైపోయింది.





# సామ్రాట్ అశోక

## 6

[మౌర్యచక్రవర్తి బిందుసారుడు అనారోగ్యంతో ఉన్నప్పుడు తక్షశిలలో తిరుగుబాటు బయలుదేరింది. బిందుసారుడి జ్యేష్ఠకుమారుడు సుశేముడు సుముఖత చూపకపోవడంతో, కనిష్ఠకుమారుడైన అశోకుడు కొంత సైన్యాన్ని వెంటబెట్టుకుని తక్షశిలకు వెళ్ళి, ఒక్క రోజులో తిరుగుబాటును అణచి రాజధానికి తిరుగు ప్రయాణమయ్యాడు. రాజధాని నగరంలో ప్రవేశించడానికి ముందే అశోకుణ్ణి హతమార్చాలని సుశేముడు పథకం వేశాడు. కాని, అది విఫలమయింది. — తరవాత]

నగరం పొలిమేరలో జరిగిన దుర్ఘటన గురించి తెలియజేసిన ప్రధానమంత్రి ఖల్లాటకుడితో రాజు బిందుసారుడు, "ఎంత దారుణం జరిగిపోయింది! అశోకుడి ప్రాణాలకు ఆపద వాటిల్లలేదు కదా? అశోకుడి వ్యూహకౌశలం గురించీ, విజయంగురించీ మీరు వివరంగా తెలియజేయగలరని ఉత్సాహంగా ఎదురు చూస్తూ కూర్చున్నాను. ఆఖరికి ఈ దుర్వార్త వినవలసి వచ్చింది. ఇప్పుడు ఆ దుర్ఘటన పూర్వాపరాల గురించి చర్చించవలసిన పరిస్థితి ఏర్పడింది!" అన్నాడు.

ప్రధానమంత్రి మౌనంగా ఉండడంతో రాజు, "తక్షశిలలో తిరుగుబాటు జరిపిన వారి ప్రతినిధులు కొందరు ఇక్కడున్నారనుకుంటాను. వాళ్ళు తిరుగుబాటును అణచిన అశోకుడి మీద ప్రతీకారంగా ఈ దారుణ చర్యకు పాల్పడి ఉంటారు.



తమరేమంటారు, మహా మంత్రీ!" అని అడిగాడు.

"ఏటికట్టపై నుంచి సేనలమీదికి బండలను దొర్లించిన దుండగులలో కొందరు పట్టుబడ్డారు. మన నగరపాలకుడు వాళ్ళ మీద విచారణ జరుపుతున్నాడు. ఏక్షణం లోనైనా ఆయన ఇక్కడికి రావచ్చు," అన్నాడు ప్రధానమంత్రి.

"అంటే, మీరీ విషయంలో మరెవరినో కూడా అనుమానిస్తున్నట్టున్నది!" అంటూ రాజు ప్రధానమంత్రి కేసి ఆతృతగా చూశాడు.

"అవును, ప్రభూ! మీ ఊహ సరైనదే," అన్నాడు ప్రధానమంత్రి.

ప్రధానమంత్రి సమాధానం విని రాజు ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందాడు. నగరపాలకుడి విచారణలో ఎటువంటి దారుణ విషయాలు బయటపడతాయో అని ఆయన ఒక్క నిమిషం ఆందోళనకు గురయ్యాడు.

ఆ విశాలమైన రాజమందిరాన్ని భయంకరమైన నిశ్శబ్దత ఆవరించింది. కొంత సేపటికి నగరపాలకుడు అక్కడికి వచ్చి రాజుకూ, మంత్రికీ నమస్కరించాడు. అతడి ముఖం విచారగ్రస్తమై ఉన్నది.

"నీ విచారణ పూర్తయిందా?" అని అడిగాడు రాజు.

"పూర్తయింది, మహాప్రభూ!" అన్నాడు. నగరపాలకుడు మెల్లగా.

"ఆ దుర్ఘటన అనుకోకుండా జరిగిన విపత్తే కదా?" అని అడిగాడు రాజు.

"కాదు, మహాప్రభూ! ఏటికట్టపై వున్న బండరాళ్ళను వదులు చేసి, వాటికింద కొయ్యపలకలను అమర్చారు. వెనక నుంచి కొయ్యపలకలను కదిలించగానే బండరాళ్ళుదొర్లుకుంటూవచ్చి సేనలపై పడ్డాయి. కొయ్యపలకలను అలా అమర్చడం చాలా శ్రమతో కూడుకున్నపని. అందుకు కనీసం వందమందినినియోగించిఉండాలి!" అన్నాడు నగరపాలకుడు.

"నమ్మశక్యం కాకుండా ఉన్నది! మన దళనాయకుడొకడూ, కొందరు సైనికులూ ఉదయం నుంచి ఉద్యానవనం వద్దే ఉన్నారు కదా! మరి వాళ్ళ కళ్ళబడకుండా అంతమంది ఎలా పనిచేయగలిగారు?" అని అడిగాడు రాజు.

"మన దళనాయకులలో ఒకడు ఈ విషయంలో దోషులకు సలహాలిచ్చి సహక

రించాడు ప్రభూ!" అన్నాడు నగరపాలకుడు విచారంగా.

"ఎంత పొగరు! ఇంతటి రాజద్రోహానికి ఇంతకుముందెన్నడూ మౌర్య సైన్యంలోని ఏ దళనాయకుడూ పాల్పడలేదే!" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"మౌర్య సింహాసనాన్ని అధిష్ఠించబోతూన్న యువరాజే, లంచమిచ్చి పురికొల్పినప్పుడు ఏ దళనాయకుడైనా ఇలాంటి రాజద్రోహానికి పాల్పడడంలో ఆశ్చర్యం ఏముంది మహారాజా!" అన్నాడు నగరపాలకుడు విచారం నిండిన కంఠస్వరంతో.

"ఏమిటి నువ్వనేది?" అన్నాడు రాజు.

"మహాప్రభువులు మన్నించాలి. నా విచారణలో బయల్పడిన సత్యాలను ప్రభువులకు తెలియజేయడం నా బాధ్యత. నేను సత్యమే చెబుతున్నాను," అన్నాడు నగరపాలకుడు వినయంగా.

కొంతసేపు అక్కడ నిశ్శబ్దం అలముకున్నది. ఆ తరవాత రాజు, "నిన్ను నేను సంపూర్ణంగా విశ్వసిస్తున్నాను. నువ్వు నాకీ సత్యం తెలియజేసినందుకు నిన్నూ, నీ రాజభక్తినీ హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. సంతోషమే కదా!" అన్నాడు నెమ్మదిగా.

"తమకీ విషయం తెలియజేయడానికి నా గుండె విలవిలలాడింది ప్రభూ. అయినా, కర్తవ్య నిర్వహణకోసం గుండెను రాయి చేసుకుని వచ్చాను. ప్రభువులు మన్నించాలి," అన్నాడు నగరపాలకుడు.

అంతవరకు వాళ్ళమాటలనుమౌనంగా వింటూన్న ప్రధానమంత్రి నగరపాలకుడితో, "నీ గుండెను మరింత దిటవు చేసుకోవలసిన అవసరం ఇప్పుడు ఏర్పడింది. మన మహారాజుకోసం, మన రాజ్యం కోసం, మౌర్యరాజకుటుంబ గౌరవం కోసం ఆ ముట్టడి రహస్యం బయటపడకూడదు. ఆ దుండగానికి పాల్పడి పారిపోతూ పట్టుబడిన ఏఒక్కరుగానీ, మీచే బందీ అయిన దళనాయకుడు గానీ, ఆకుట్రలో పాలుపంచుకున్న ఏ సైనికుడుగానీ దానిని గురించి నోరు తెరవడానికి ఏమాత్రం అవకాశం ఇవ్వకూడదు!" అని, రాజుకేసి తిరిగి, "నా మాటలకు ప్రభువుల ఆమోదం లభిస్తుందనుకుంటాను," అన్నాడు.



"మహామంత్రి విజ్ఞతనూ, వివేకాన్నీ గౌరవిస్తాను," అన్నాడు రాజు విచారంగా.

"అయినా, వాళ్ళందరూ కలిస్తే వంద మందికి పైగా ఉంటారే!" అన్నాడు నగర పాలకుడు ప్రధానమంత్రితో మెల్లగాతనలో గొణుక్కుంటున్నట్టు.

"ఉండనీ! వాళ్ళందరి నోళ్ళూ శాశ్వతంగామూయించాలి. ఆపని కూడాసూర్యోదయంలోగా జరిగిపోవాలి. తెల్లవార గానే సేనలమీద బండలుదొర్లించి యువరాజు అశోకుణ్ణి హతమార్చడానికి కుట్ర పన్నింది తక్షశిల తిరుగుబాటుదార్లనీ, ఆ దుండగులందరినీ పట్టుకుని మరణదండన విధించామనీ చాటింపుద్వారా ప్రజలకు తెలియజేయాలి," అన్నాడు ప్రధానమంత్రి.

"మీ నిర్ణయం సరైనదే! కాని..." అని ఇంకేదో అనబోతూఆగాడునగరపాలకుడు.

"మన రాజ్య సంరక్షణకోసం వెయ్యి మందిని హతమార్చాలంటే నువ్వు వెనకాడగలవా?" అని అడిగాడు ప్రధానమంత్రి.

"ఏమాత్రం వెనకాడను!" అన్నాడు నగరపాలకుడు.

"మన యువరాజు సుశేముడికీ, అశోకుడికీ మధ్య ఉన్న ద్వేషం, పగగురించిన వదంతులు కూడా రాజ్య విచ్ఛిత్తికి దారితీస్తాయి. ఇప్పుడు బందీలుగా పట్టుబడిన వాళ్ళను వదిలి పెడితే లేనిపోని వదంతులను వ్యాపింపజేస్తారు కదా!" అన్నాడు ప్రధానమంత్రి.

"అవును, మీరన్నది నిజమే!" అన్నాడు నగరపాలకుడు దృఢమైన కంఠస్వరంతో.

"మంచిది. సరిగ్గా అర్ధరాత్రిసమయంలో నీ కర్తవ్యాన్ని నిర్దాక్షిణ్యంగా నిర్వర్తించు!" అని అజ్ఞాపించాడు రాజు.

నగరపాలకుడురాజుకూ,మంత్రికీనమస్కరించి అక్కడి నుంచి బయలుదేరాడు.

నగరపాలకుడు రాజభవనం దాటక ముందే యువరాజు సుశేముడు అతనికి



ఎదురుపడి, "పట్టుబడిన దళనాయకుడు, అశోకుణ్ణి హతమార్చే కుట్రతో నాకూ సంబంధం ఉందని చెప్పాడని విన్నాను, నిజమేనా?" అని అడిగాడు.

"అవును. అలాగే చెబుతున్నాడు," అన్నాడు నగరపాలకుడు.

"అబద్ధం! అంతా అబద్ధం! అబద్ధాలు పలికే ఆ నీచుడికి మరణదండన విధిం చాలి!" అని అరిచాడు సుశేముడు.

ఆ మాటకు నగరపాలకుడు ఒక క్షణం నిర్విణ్ణుడయ్యాడు. ఇంతటి కపట బుద్ధి కలవాడా తమకు కాబోయే రాజుఅని అతడు మనసులో బాధపడ్డాడు.

"దళనాయుకుడు చెప్పిన అబద్ధం మహారాజుకు తెలిసిందా?" అని అడిగాడు సుశేముడు మళ్ళీ.

"దళనాయకుడు చెప్పిన విషయాలు మహారాజుకు తెలియజేయడం నాఉద్యోగ ధర్మం, ప్రభూ!" అన్నాడు నగరపాలకుడు.

"ఆ విషయం రాజు నమ్మారా?" అని అడిగాడు సుశేముడు.

"ఆ విషయం నేను చెప్పలేను,ప్రభూ!" అన్నాడు నగరపాలకుడు.

"అది సరే. ఆవిషయం వినగానేరాజు ఏమన్నారు"? అని రెట్టించాడు సుశేముడు మళ్ళీ.

"అది కూడా చెప్పడం కష్టం. అయితే, ఒక్కవిషయం మాత్రం తెలుసు. దళనాయ కుడితోసహా ఆ దుండగానికి పాల్పడిన వారందరికీ, మరణదండన విధించాలని మహారాజు నిర్ణయించారు," అన్నాడు నగరపాలకుడు.

"బావుంది! అద్భుతమైన నిర్ణయం! నాలాగే నా తండ్రి కూడా ఎంతటి వివేక వంతుడో చూశావా!" అంటూ సుశేముడు ఆనందంతో చప్పట్లు కొట్టాడు.





నగరపాలకుడికి పట్టరాని ఆగ్రహం కలిగింది. కాని దానిని బయటకు కనబడ నీయకుండా, "నిజమే ప్రభూ!" అన్నాడు.

అప్పుడే మగధసేనాధిపతి రాజదర్శనానికి వెళుతూ అటువచ్చాడు. ఆయన సుశేముడికి నమస్కరించాడు. నగరపాలకుడు సేనాధిపతికి నమస్కరించి, "నేను తమరిని చూడ డానికే వస్తున్నాను," అన్నాడు.

"ఇక్కడే ఉండు. ఇప్పుడే తిరిగి వస్తాను," అంటూ సేనాధిపతి ముందుకు నడిచాడు.

"మిమ్మల్నీ, నన్నూ మహారాజు ఒక్కసారిగా రమ్మన్నట్టున్నది," అంటూ సుశేముడు కూడా సేనాధిపతి వెంట వేగంగా నడిచాడు.

మహారాజు వాళ్ళను చూడగానే, "ముఖ్యులైన మీరు ముగ్గురూ ఒక్కసారిగా నా దగ్గరికి రావడం మంచిదయింది. మీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి. కూర్చోండి," అన్నాడు.

ప్రధానమంత్రీ, సేనాధిపతీ, సుశేముడూ పట్టుపరుపులు పరచిన ఆసనాల మీద కూర్చున్నారు. కొన్ని నిమిషాల మౌనం తరవాత మహారాజు సుశేముడి కేసి చూస్తూ, "నేను విన్నది నమ్మడానికి నా మనసొప్పడం లేదు నాయనా!" అన్నాడు విచారంగా

"మీరు విన్నదేదో నాకు తెలియదు," అన్నాడు సుశేముడు.

"దీనిని కూడా నేను నమ్మలేను. నేను విన్నదేదో నీకు బాగాతెలుసు. దానిని నేను నా నోటితో చెప్పలేను. కాలగతిలో అన్నీ బయట పడతాయి. జరగవలసిన దేదోకాలమే నిర్ణయిస్తుంది. దానినిఅలా ఉంచి ప్రస్తుత విషయానికి వద్దాం. మన పరగణాలలో ముఖ్యమైన అవంతీ రాజధాని ఉజ్జయినికి రాజ ప్రతినిధిగా ఒక యువరాజును పంపాలని మన ప్రధానమంత్రీ, సేనాధిపతీ అభిప్రాయ పడుతున్నారు. నువ్వూ, అశోకుడూ తప్ప మరెవ్వరూ ఆ పదవికి అర్హులు కారు. మరొక ముఖ్యమైన విషయం ఏమంటే శత్రువుల్లా కాకుండా వివేకవంతులైన సోదరులుగా మీరిద్దరూ మసలుకునేంత వరకు, మీరుఒకరికొకరు దూరంగా ఉండాలని మేము ఆశిస్తున్నాము," అన్నాడు రాజు.

సుశేముడు మాట్లాడకుండా మౌనం వహించాడు.

"నువ్వు ఉజ్జయినికి వెళతావా?" అని అడిగాడు రాజు.

"నేను ఇక్కడే ఉంటాను," అన్నాడు సుశేముడు.

"జ్యేష్ఠ కుమారుడిగా, వెళ్ళే ప్రదేశాన్ని నిర్ణయించుకునే అవకాశం నీకే కల్పించాను. సరే, ఉజ్జయినికి అశోకుడే వెళ్ళనీ, అతడునాసలహానుపాటించగలడనుకుంటాను. ఇకనువ్వువెళ్ళు," అన్నాడు రాజు.

సుశేముడు లేచినిబడ్డాడు. రాజు తనను యువరాజుగా కాకుండా, కేవలం జ్యేష్ఠకుమారుడిగాప్రస్తావించడం అతనికి ఆగ్రహం కలిగించింది. వడివడిగా వెలుపలికి నడిచాడు.

* * *

"అయ్యా! నా మీద కనికరించి, ఒకే ఒక్కసారి యువరాజు సుశేముణ్ణి చూసే అవకాశం కల్పించండి. ఈ సమయంలో ఆయన ఒక్కడే నన్ను రక్షించగలడు! నేనొక్క పాపమూ ఎరగను. అంతా ఆయన చెప్పినట్టే చేశాను. అంతేగాని నాకేమీ తెలియదు!" అని ప్రాథేయ పడసాగాడు పట్టుబడిన దళనాయకుడు నగరపాలకుడితో. బందీలుగా పట్టుబడిన వందమంది సైనికులతో పాటు దళనాయకుణ్ణి కూడా వధ్యస్థలానికి నడిపించారు.

దళనాయకుడి గోడు వినలేక నగరపాలకుడు, "నీకు మరణదండన విధించాలని ఆయువరాజే సెలవిచ్చాడు.జీవితం చివరిఘడియల్లోఉన్న నీతోఅబద్ధం చెప్పవలసిన అవసరం నాకు లేదు," అన్నాడు.

"ఏమిటీ! యువరాజు సుశేముడునాకు మరణదండన విధించాలన్నాడా?"అంటూ బిగ్గరగా విలపించసాగాడు దళనాయకుడు.

"అవును, ఎందుకంటే ఈ కుట్రలో నువ్వతణ్ణి భాగస్వామిని చేశావు కాబట్టి!అది అబద్ధం అని ఆయన అంటున్నాడు!" అన్నాడు నగరపాలకుడు.

"ఎంత అన్యాయం జరిగిపోయిందిరా దేవుడా! సుశేముడు సర్వనాశనమైపోతాడు. నాకు పట్టి నగతి వాడికీ పడుతుంది!" అంటూ వధ్యస్థలంలో దీనంగా విలపిస్తూన్న దళనాయకుడి మెడ మీద కత్తి పడింది! — (ఇంకావుంది)





# గోపన్నగొప్పతనం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, భీతి గొలిపే ఈ శ్మశానంలో ఇంత అర్ధరాత్రివేళ, ప్రతి ఒక్కసారీ అనుకున్నది సాధించాలనే నీ ప్రయత్నం భంగపాటుకు గురవుతున్నా, మొక్కవోని నీ పట్టుదల అభినందించ దగినదే! అయితే, మనిషిలో విచక్షణా జ్ఞానం, సాధ్యాసాధ్యాల గురించిన అవగాహనా లోపించినప్పుడు--పట్టుదల మొండితనంగానూ, శ్రమా, ఓర్పూ అనేవి అమాయక, జడత్వ లక్షణాలుగానూ పరిణమించే ప్రమాదమున్నది. ఇందుకు ఉదాహరణగా; బాగా డబ్బు సంపాదించాలనీ, అందరిచేతా గొప్పవాడనిపించుకోవాలనీ ఆశించిన గోపన్న అనేవాడు, విచక్షణా,

## బేతాళ కథలు



తార్కిక దృష్టి లోపించిన కారణంగా, లభించిన అవకాశాలను జారవిడుచుకున్నాడు. వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

గోపన్నకు మంచివాడని పేరు. మధురవాడ గ్రామంలోప్రతిఒక్కరూవాడంటే ఇష్టపడతారు. అయితే గోపన్నకు బాగా డబ్బు సంపాయించాలనీ, అందరిచేతా గొప్పవాడనిపించుకోవాలనీ బలమైన కోరిక వుండేది. ఆ ఉద్దేశ్యంతో వాడు ముందుగా, తన గ్రామంలోని పేరుపడ్డ పండితుడు రామశర్మ ఇంటికి వెళ్ళాడు.

రామశర్మ, గోపన్న పరిజ్ఞానాన్ని పరీక్షించాడు. ఒక వారం రోజులపాటు వాడికి పాఠాలు చెప్పి వల్లెవేయించాడు. తర్వాత వాడితో, "నాయనా! నీలో పండితుడయ్యే లక్షణాలులేవు. అయితే నీ గొంతు శ్రావ్యంగావుంది. త్రిపురానగరంలో రాగయ్య అనే గొప్ప సంగీత విద్వాంసుడున్నాడు. ఆయన వద్దకు వెళ్ళి సంగీతం నేర్చుకో," అని సలహా ఇచ్చాడు.

గోపన్న త్రిపురానగరం వెళ్ళి, రాగయ్యను కలుసుకున్నాడు. ఆయన వారం రోజుల పాటు వాడికి పాఠాలు చెప్పాక, "నాయనా! నీగొంతు శ్రావ్యమైనదే. అందులోంచి తీయని మాటలు వస్తాయి తప్ప, పాటలు రాకపోవడం నాకే విడ్డూరంగా వుంది. నువ్వు సంగీతానికి పనికిరావు. అయితే, నీ చేతి వ్రేళ్ళు ఎంతో పొడుగ్గా చిత్రలేఖనానికి అనువుగావున్నాయి. విజయపురంలో సురేఖుడనే గొప్ప చిత్రకారుడున్నాడు. ఆయన వద్దకు వెళ్ళి, ఆవిద్య నేర్చుకో," అన్నాడు.

సురేఖుడు వారం రోజులపాటు గోపన్నను పరీక్షించి, "నాయనా! చిత్రకారుడికి ఊహాశక్తి వుండాలి. తను చూసిన ప్రతి దృశ్యాన్ని సవివరంగా గుర్తుచేసుకుంటేనే, ఎవరైనా చక్కని బొమ్మలు గీయగలుగుతారు. ప్రస్తుతానికి నీ ఊహాశక్తి అంతంతమాత్రంగా వున్నది. కొంత కాలం పాటు నీ ఊహాశక్తికి మెరుగులు దిద్దాలి. అందుకు పాండిత్యం అవసరం. మధురవాడలో రామశర్మ అనే మహాపండితుడున్నాడు. కొంతకాలం పాటు, నీవాయనకు శుశ్రూష చెయ్యి," అన్నాడు.

తను మధురవాడ నుంచే వస్తున్నాననీ, రామశర్మ తను పండితుడు కాలేడన్నాడనీ చెప్పడానికి, గోపన్నకు చిన్నతనం

వేసింది. వాడు సురేఖుడికి కృతజ్ఞతలు తెలుపుకుని, అక్కడి నుంచి ఇంటిముఖం పట్టాడు. ఈ జన్మకు తను గొప్పవాడయ్యే అవకాశం లేదని వాడు నిరాశ చెందాడు.

తన గ్రామం పొలిమేరల్లో వుండగా గోపన్నకు, "రక్షించండి! రక్షించండి!" అన్న కేకలు వినబడ్డాయి. ఎవరా అని చూస్తుం డగా, వాడికామాటలు దారిపక్క నున్న గోతిలోంచి వస్తున్నట్లు తెలిసింది - తొంగి చూస్తే, అది నిలువు లోతు గొయ్యి. అందులో మనిషొకడున్నాడు. గోపన్న చేయి అందించబోతే, అది ఆ మనిషికి అందలేదు.

"నేను నీకు సాయపడతాను, ధైర్యంగా వుండు. దగ్గర్లో ఏదైనా చెట్టు కొమ్మగానీ, తాడు గానీ దొరుకుతుందేమో చూసి వస్తాను," అన్నాడు గోపన్న, ఆ మనిషికి ధైర్యం చెబుతూ.

"నువ్వంత మాటన్నావు కదా, అదే చాలు," అన్నాడామనిషి.

తర్వాత గోపన్న చూస్తూండగా ఆ మనిషి పైకి వచ్చాడు. ఆ గొయ్యి పూడుకు పోయింది.

"నీకు మహిమలున్నట్టుతోస్తున్నది. అలాంటప్పుడు, రక్షించమని కేకలెందుకు పెట్టావు?" అని అడిగాడు గోపన్న ఆశ్చ ర్యంగా.

ఆ మనిషి నవ్వి, "నేనొక సన్యాసిని. నాకు అద్భుతశక్తులున్నాయి. రోజుకొక మంచివాడి కోరిక తీరుస్తూంటాను. అందు కని ఒక గోతిని సృష్టించుకుని అందు లోంచి కేకలు పెడతాను. మంచితనం,



అదృష్టం వున్నవాడు నా దగ్గరకు వస్తాడు. ఈ రోజు అదృష్టం నీది. నీకేం కావాలో కోరుకో," అన్నాడు.

గోపన్న నిట్టూర్చి, "గొప్పవాణ్ణి కావాలని, బాగా డబ్బు సంపాయించాలని నా కోరిక. ఆ కోరికలు తీర్చుకోవడం కోసం, నేను చెయ్యని ప్రయత్నంలేదు," అంటూ సన్యాసికి తన కథ చెప్పుకున్నాడు.

సన్యాసి, గోపన్న తలపై చెయ్యిపెట్టి, "ఈ క్షణం నుంచీ నీకు ఎంత గొప్ప పండితుడినైనా ఓడించగల పాండిత్యం లభిస్తుంది. సంగీతం, చిత్రలేఖనాల్లో కూడా, నీ గొప్పతనాని కెదురుండదు. ఇది నా దీవెన!" అన్నాడు. గోపన్న, సన్యా సికి సాష్టాంగ నమస్కారం చేసి లేచి నిల బడ్డాడు. సన్యాసి వాడితో, "నువ్వు నీ





రామశర్మ ఒక్క ప్రశ్నకూ బదులులివ్వ లేక, ఉక్రోషంతో గోపన్ననే బదులు చెప్ప మన్నాడు. వాడు చెప్పగానే ఆశ్చర్యపడి, "నీ పాండిత్యం అసాధారణం. ఇలాంటి జ్ఞానం సంపాదించడానికి, నాకీ జన్మ చాలదు," అన్నాడు.

గోపన్న అక్కణ్ణించి త్రిపురానగరం వెళ్ళి రాగయ్యను కలుసుకుని, రామశర్మకు చెప్పినట్టే చెప్పి, "తమరొక పాట పాడండి. అందులో లోపాలుంటే చెబుతాను," అన్నాడు.

రాగయ్య చక్కని పాట పాడాడు. గోపన్న వెంటనే, "పామరులకిది బాగానే అనిపి స్తుంది. కానీ విద్వాంసులు పాడవలసిన తీరు ఇది కాదు," అంటూ, ఆ పాటను కొద్దిగా సవరించి తను పాడి వినిపించాడు.

రాగయ్య, వాడికి చేతులు జోడించి, "మహానుభావా! నువ్వు కారణజన్ముడివి. ఇలా పాడడం ఈ జన్మంతా సాధనచేసినా నాకు సాధ్యం కాదు. గతంలో నీ గురించి నేనన్న మాటలకు నన్ను క్షమించు," అన్నాడు.

తర్వాత గోపన్న విజయపురంలోని సురేఖుణ్ణి కలుసుకుని ఆయన చిత్రాల్లో కొన్ని మార్పులు చేశాడు. అప్పుడా చిత్రాల్లో వచ్చిన అద్భుతమైన అందచందాలకు సురేఖుడు ఆశ్చర్యపడి, "నాయనా! నువ్వు దేవాంశ సంభూతుడివి. భూమ్మీద ఇంకెవ రికీ ఈవిధంగా చిత్రాలు గీయడం సాధ్యం కాదు," అన్నాడు.

తను గొప్పవాడినన్న భావం అప్పటికి గోపన్నలో పూర్తిగా కలిగింది. ఆ గొప్పత

గొప్పతనంతో మాత్రమే డబ్బు సంపాదించ గలవు! ఆ విషయం గుర్తుంచుకో, వెళ్ళు!" అన్నాడు.

ముందుగా గోపన్న, రామశర్మను కలుసు కుని, ఆయనతో, "అయ్యా! తమరు నాలో పండితుడు కాగల లక్షణాలు లేవ న్నారు. వెనుకటికి విష్ణుశర్మ అనే పండి తుడు ఎందుకూ పనికిరాని పరమ మూర్ఖులైన రాజకుమారులను పంచతంత్ర కథలతో వివేకవంతుల్ని చేయగలిగాడు. ఈ ప్రపంచంలో పట్టుదలగల శిష్యుడు నేర్వలేని విద్య అంటూవుండదు. కాబట్టి లోపం నాలో కాక తమలో వున్నదని పిస్తున్నది. నేను వేసే కొన్ని ప్రశ్నలకు జవాబివ్వండి," అంటూ కొన్ని ప్రశ్నలు వేశాడు.

నాన్ని ఉపయోగించుకుని బాగా డబ్బు సంపాదించాలని వాడనుకున్నాడు. విజయ పురంలోనే విమలానందుడనే భాగ్యవంతు డున్నాడు. ఆయన పండితులను బాగా ఆదరిస్తాడని పేరు. గోపన్న ఆయనను కలుసుకుని, తన పాండిత్యం ప్రదర్శిం చాడు.

విమలానందుడు గోపన్న వివరాలు తెలుకుని, "ఆర్యా! మీ వంటి పండితుడి దర్శనభాగ్యంతో నా జన్మ తరించింది. ఇంతవరకూ ఎవ్వరికీ ఇవ్వని కానుక తమరికిస్తాను," అంటూ ఒక తాళపత్రాన్ని చ్చాడు.

అది వేదవ్యాసుడు చెప్పగా విఘ్నేశ్వ రుడు స్వహస్తాలతో రాసిన మహాభారత గ్రంథంలోని ఒక తాళపత్రమట. పూర్వ జన్మసుకృతంకొద్దీవిమలానందుడి పూర్వీకు లలో ఒకరికది లభించిందట. తరతరా లుగా ఆయన పూర్వీకులు, ఆ తాళపత్రాన్ని ప్రాణప్రదంగా చూసుకుంటున్నారట.

ఆ తాళపత్రం చూసి గోపన్న నిరుత్సాహ పడ్డాడు. అయితే, తనకు ధనం కావాలని విమలానందుణ్ణి అడగలేక పోయాడు. తన వద్ద సెలవు తీసుకుంటున్న గోపన్నను విమలానందుడు, "ఆర్యా! పొరుగూరిలో నా అన్న భ్రమరానందుడున్నాడు. ఆయ నకు సంగీతం ప్రాణం. తమరికా విద్యలో ప్రవేశముంది కాబట్టి, నన్ను సంతోష పెట్టినట్లే ఆయన్నూ సంతోష పెట్టగలరు," అని కోరాడు.

గోపన్న భ్రమరానందుణ్ణి కలుసుకుని, తన సంగీత విద్యను ప్రదర్శించాడు.



ఆయన బ్రహ్మానందం చెంది, "ఈ భూమ్మీద మీవంటి గాయకుడు మరొకరుంటారను కోను. మీకే కానుకలిచ్చినా అమూల్యమైన తమప్రతిభకు వెలకట్టినట్లవుతుంది. ఇంత వరకూ ఎవ్వరికీ ఇవ్వని కానుక తమరికి స్తాను," అని ఒకచిన్నకంచుభరిణెఇచ్చాడు.

ఆ కంచుభరిణె, తరతరాలుగా వారి కుటుంబంలో అపురూపంగా చూసుకో బడుతున్న వస్తువు. ఆభరిణెమూత తెరిచి చెవికానించుకుంటే, నాదబ్రహ్మ త్యాగ రాజు గొంతు వినబడుతుంది. మనసులో ఏ కృతిని కోరుకుంటే, అది చెవిలో ఆయన కంఠస్వరంలో వినబడుతుంది.

తనకు డబ్బు కావాలని నోరువిప్పి అడగలేక, తన దురదృష్టానికి తననే నిందించుకుంటూ, అక్కడి నుంచి సెలవు



తీసుకోబోతున్న గోపన్నతో, "అయ్యా! మా అన్నగారు చిత్రానందుడు పొరుగూరిలో వుంటున్నాడు. తమరాయన్ను కలుసుకుని, తమ చిత్రలేఖనా ప్రావీణ్యంతో ముగ్ధుణ్ణి చేయగలరు. కళకు ప్రాణం పెడతారాయన," అన్నాడు భ్రమరానందుడు.

చిత్రానందుడు గోపన్న చిత్రకళకు మెచ్చి, అజంతా చిత్రకారుడు విడిగావేసిన బొమ్మ ఒకటి, వాడికి కానుకగా ఇచ్చాడు. ఇప్పటికీ వెలిసిపోని రంగులతో, జీవకళ ఉట్టిపడుతూ ఆ చిత్రం ఎంతో అద్భుతంగా వున్నది.తనకుడబ్బు దొరకలేదనిమనసులో వ్యథపడుతూ సెలవు తీసుకుంటున్న గోపన్నతో, "అయ్యా! తమను డబ్బుతో సత్కరించగలవాడు మనదేశపు రాజొక్కడే! తమరాయనను దర్శించి తగిన సత్కారం పొందవలసిందిగా కోరుతున్నాను. తమ బోటి కళాకారులకు ధనవ్యామోహం వుండదని నాకు తెలుసు. కానీ రాజసత్కారం కళాకారులకు గౌరవప్రదం," అన్నాడు చిత్రానందుడు.

ఆయన మాటలతో గోపన్నకు డబ్బు సంపాయించే ఉపాయం తెలిసింది. వాడు తక్షణం రాజధానికి ప్రయాణం కట్టి, అక్కడికి చేరుకోగానే ఒక సత్రంలో బస చేశాడు. ఆ సత్రంలో వాడికి రామశర్మ, రాగయ్య, సురేఖుడు కనిపించారు.

ఆ దేశపు రాజు దేశంలోని కళాకారుల మధ్య పోటీలు నిర్వహిస్తున్నాడట. ఉత్తమ కళాకారులను ఘనంగా సన్మానిస్తాడట. వాళ్ళు ముగ్గురూ, ఆ పోటీల గురించే వచ్చారు. గోపన్నను చూడగానే వాళ్ళు నీరసపడి, "ఈ ప్రపంచంలో ఎవరితో నైనా దైర్యంగా పోటీపడగలం.కానీ మీరు పోటీలో పాల్గొనే మాటైతే మాత్రం, ఫలితం మాకు ముందే తెలుసు. మేమిక తిరిగిపోతాం," అన్నారు.

ఆ ముగ్గురూ మానవ ప్రయత్నంతో, వారివారి విద్యల్నిసాధించారు.తనుఅదృష్టం కొద్దీ ఆయా విద్యల్లో ప్రవీణుడయ్యాడు! ఇలా ఆలోచించి గోపన్న వాళ్ళతో, "మీరు ముగ్గురూ నాకు గురుతుల్యులు. మీకారణంగానే నేను, ఈ ఉన్నత స్థితికి చేరుకున్నాను.పోటీలు నేనుచూస్తానే తప్ప పాల్గొనను. ఈ పోటీల్లో మీరు నెగ్గక పోతేమాత్రం, మిమ్మల్నోడించిన వారిని నేనోడిస్తాను," అన్నాడు.

ఈ మాటకు రామశర్మ, రాగయ్య, సురేఖుడు ఎంతో సంతోషించారు. అయితే

గోపన్న పోటీల్లో పాల్గొన వలసిన అవసరం లేకపోయింది. వాళ్ళు ముగ్గురూ తమ విద్యల్లో అందరికంటే మిన్న అనిపించుకుని, ఒక్కొక్కరు లక్ష వరహాలచొప్పున రాజు నుంచి కానుకగా పొందారు.

తిరుగు ప్రయాణమైనప్పుడు, వాళ్ళు ముగ్గురూ గోపన్నకు కొంత డబ్బు ఇస్తామన్నారు. గోపన్నవారితో, "ఎవరికేది ప్రాప్తమో అదే లభిస్తుంది. నేను డబ్బును దానంతీసుకునేందుకు ఇష్టపడను," అన్నాడు.

"డబ్బు ఊరికే తీసుకోవద్దు. ప్రతిఫలంగా మాకేదైనా మేలు కలిగించుదురుగాని!" అన్నారా ముగ్గురూ.

వాళ్ళ ఉద్దేశ్యం గోపన్న నుంచి తమకు తెలియని కొత్తవిశేషాలు; తమతమ విద్యలకు సంబంధించినవి తెలుసుకోవాలని.

అయితే, ఆ మాటను మరొకవిధంగా అర్థం చేసుకున్న గోపన్న, "నా దగ్గర ఏమున్నాయి– వేదవ్యాసుడి తాళప్రతం, త్యాగరాజు పాటలభరిణె, అజంతా బొమ్మ తప్ప!" అన్నాడు.

ఆ మాట వింటూ రామశర్మ, రాగయ్య, సురేఖుడు ఆశ్చర్యపడి, "ఏమిటవి? వాటి వివరాలు చెప్పండి!" అన్నారు.

గోపన్నవారికి తన వద్ద వున్న అపూర్వ వస్తువుల వివరాలు చెప్పగానే, వాళ్ళెంతో అబ్బురపడి, "ఎంతడబ్బిచ్చినా దొరికే వస్తువులుకావవి. ఒక్కొక్కరం లక్ష వరహాలిస్తాం. వాటిని మాకివ్వండి," అని వేడుకున్నారు.

గోపన్న వెంటనే ఏమి చేసేందుకూ తోచక, వాళ్ళతో, "ఆ చెరువు గట్టున వున్న మర్రి నీడకు వెళదాం. అక్కడ



నా నిర్ణయమేదో తెలియ చెబుతాను," అన్నాడు. నలుగురూ అటుకేసి నడవసాగారు. గోపన్న మనసులో ఎంతగానో మధనపడుతూ చెట్టు వద్దకు చేరగానే, "సన్యాసి మాటలోని గూఢార్థం ఇప్పటికి గ్రహించగలిగాను. సన్యాసి ఎవరని అడక్కండి. మీరు నిజమైన కళాకారులు. ఈ అపూర్వ వస్తువులు, మీ వద్ద వుండడమే న్యాయం!" అంటూ, వాళ్ళకు తాళపత్రం, పాటల భరిణె, అజంతాబొమ్మ ఇచ్చి, వాళ్ళిచ్చిన మూడులక్షల వరహాలు తీసుకుని, తన గ్రామం కేసి బయల్దేరాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గోపన్న బాగా డబ్బు సంపాదించాలనీ, గొప్పవాడిననిపించుకోవాలనీ పట్టుదలతో ఎందరినో ఆశ్రయించి, చివరకు సన్యాసి దీవెన కారణంగా – ఎంతటి పండితుల

నైనా ఓడించ గల శక్తిని సంపాయించాడు. అయితే వాడు దానిని సందర్భోచితంగా ఉపయోగించినట్టు కనబడదు. రాజు కళాకారుల మధ్య పెట్టిన పోటీలలో పాల్గొని, పండితులందరినీ ఓడించి, ఆయన నుంచి ఎన్నో కానుకలు పుచ్చుకునే అవకాశాన్ని జారవిడుచుకున్నాడు! చివరకు తనకు లభించిన అపూర్వ వస్తువులను పండితులకిచ్చి, వారి నుంచి మూడులక్షల వరహాలు తీసుకుని తృప్తి పడ్డాడు. వీటన్నిటికీ – వాడిలో విచక్షణా, వివేకం, తార్కిక దృష్టీ లోపించడమే గదా కారణం? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సన్యాసి, గోపన్నకు ఎంత గొప్ప పండితులనైనా ఓడించగల సకల కళాపాండిత్యం ప్రసాదిస్తూనే, డబ్బు సంపాయించే విషయంలో మాత్రం, ఒక నియమం, నిబంధన వున్న సంగతి గురించి హెచ్చరించాడు. అదేమంటే– గోపన్న తన పాండిత్యం ద్వారా కాక, వ్యక్తిగతమైన తన మంచి ప్రవర్తన వల్ల లభించే గొప్పతనం కారణంగానే డబ్బు సంపాయించగలడని. రాజు పెట్టిన పోటీలలో వాడు రామశర్మ, రాగయ్య, సురేఖులను ఓడించగలిగి వుండీ, ఆ పనిచెయ్యక తన గొప్పతనాన్ని నిరూపించుకున్నాడు. అంతేకాక, తన వద్ద వున్న వస్తువులు, నిజమైన కళాకారులకు మాత్రమే అపూర్వ వస్తువులనీ, వాళ్ళు వాటిని డబ్బు కంటే అపూర్వంగా చూసుకుంటారనీ గ్రహించాడు. తన కృత్రిమ పాండిత్యం పండితులనోడించ గల శక్తినిచ్చింది కానీ, తనకు కళాదృష్టిని ప్రసాదించలేకపోయింది. కాబట్టి ఆ వస్తువులు సమర్థులైన కళాకారుల వద్ద వుండడమే న్యాయం! ఈ విధంగా ఆఖరిక్షణంలో వాడికి కలిగిన వివేకం కారణంగా, పండితులిచ్చిన మూడులక్షల వరహాలతో – తృప్తి పడి, తన గ్రామం వెళ్ళిపోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

*[ఆధారం: "వసుంధర" రచన]*



# ఆంధ్రతీరం

రచన : మీరానాయర్ ✷ చిత్రకారుడు: కె.ఎస్. గోపకుమార్




మచిలీపట్నానికి ఈశాన్యంగా **గోదావరి డెల్టా** ఉన్నది. దక్షిణ భారతదేశంలో చాలా పొడవైన గోదావరీనదిని దక్షిణ గంగ అని అంటారు. గోదావరి డెల్టాకు ఈశాన్య దిశలో **యానాం** ఉన్నది.

యానాం 34 చ.కి.మీ విస్తీర్ణం గల చిన్న పట్టణం. ఇది చాలాకాలం ఫ్రెంచి పాలనలో ఉండేది. ఇప్పుడు పాండిచ్చేరి కేంద్రపాలితప్రాంతంలో భాగంగా ఉంటున్నది.

దీనికి మరికొంత దూరం ఉత్తరంగా **సర్పాపురం** అనే సముద్రతీర గ్రామం ఉన్నది. ఇక్కడి భావనారాయణస్వామి ఆలయం కారణంగా ఈ గ్రామం ప్రసిద్ధిగాంచింది.

సర్పరాజైన అనంతుడి తల్లి పాముల మీది ఆగ్రహంతో సర్వనాశనం కమ్మని శపించింది. ఆ శాప ఫలి తంగా పాములన్నీ ఒక యజ్ఞకుండంలో పడి మరణించాయి. ఆ సమయంలో సర్పరాజు అనంతుడు అక్కడ లేడు. తీర్థ యాత్రకు వెళ్ళాడు. తిరిగి వచ్చి జరిగిన దానిని తెలుసుకుని విషాదం చెందాడు. చచ్చిన పాములన్నిటినీ మళ్ళీ బతికించుకోవాలన్న ఆశయంతో మహావిష్ణువును గురించి ఘోరమైన తపస్సు చేశాడు. అనంతుడు తన భావంలో అంటే మనసులో ఊహించుకున్న రూపంలోనే మహావిష్ణువు ఆయనకు ప్రత్యక్షమయ్యాడు. అందుకే ఇక్కడి దేవుడికి భావనారాయణస్వామి అనే పేరు వచ్చింది. అనంతుడు ఇక్కడ ఆలయ నిర్మాణం జరిపి, మహావిష్ణువు తనకు కనిపించిన రూపంలోనే విగ్రహం ప్రతిష్ఠించాడని స్థలపురాణాలు పేర్కొంటాయి.

**కాకినాడ చేపలరేవు**



ఇక్కడి నుంచి మరికొంత దూరం ఉత్తరంగా వెళ్ళామంటే **కాకినాడ** చేరుకుంటాం. ఇదొక చిన్న రేవుపట్టణం. ఇక్కడి నుంచి ప్రత్తి, వేరు శనగ, చక్కెర, పొగాకు మొదలైనవి ఎగుమతి చేస్తారు. 1923 వ సం॥లో ప్రథమ ఖిలాఫత్ నాయకుడు మౌలానా మహమ్మద్ అలీ అధ్యక్షత వహించిన చారిత్రాత్మకమైన భారత జాతీయ కాంగ్రెస్ మహాసభ కాకినాడలో జరిగింది.



ద్రాక్షారామ ఆలయం

కాకినాడకు 17కి.మీ. దూరంలో ఉన్న తీరపట్టణం **ద్రాక్షారామం.** 'దక్ష ఆరామం' అంటే దక్ష ప్రజాపతి యజ్ఞం చేసిన ప్రదేశం అనే మాటనుంచే 'ద్రాక్షారామం' అనే పేరు వచ్చిందని చెబుతారు. దక్ష ప్రజాపతి పుత్రిక అయిన దాక్షాయణి తండ్రి కోరికకు విరుద్ధంగా పరమశివుణ్ణి వివాహమాడింది. ఆ తరవాత దక్షుడు గొప్ప యజ్ఞం చేయ తలపెట్టాడు, దేవతలందరినీ ఆహ్వానించాడు. కాని పరమశివుణ్ణి మాత్రం ఆహ్వానించలేదు. అయినా తండ్రి చేస్తూన్న యజ్ఞాన్ని చూడాలన్న కుతూహలంతో దాక్షాయణి ఒంటరిగా అక్కడికి వెళ్ళింది. అక్కడామె తండ్రి ఉదాసీనతకు గురయ్యింది. అంతేకాదు, దక్షుడు అక్కడలేని ఆమె భర్తను పదిమందిలో హీనంగా నిందించాడు. ఆ అవమానాన్ని భరించలేక దాక్షాయణి యజ్ఞకుండంలో పడి ఆత్మాహుతి చేసుకున్నది. ఆ సంగతి తెలియగానే పరమశివుడు అమితమైన ఆగ్రహావేశానికి లోనయ్యాడు. ఆయన చెమటబిందుల నుంచి వీరభద్రుడు పుట్టుకువచ్చి దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసి దక్ష ప్రజాపతిని సంహరించి, పరమశివుణ్ణి శాంతింప చేశాడనిపురాణాలు పేర్కొంటున్నాయి.

కవిసార్వభౌముడు శ్రీనాథుడు భీమఖండమనే తెలుగుకావ్యం రచించడానికి ద్రాక్షారామ భీమేశ్వర ఆలయం ప్రేరణ కలిగించిందని చెబుతారు. 14వ శతాబ్దానికి చెందిన మహాకవి శ్రీనాథుడే ఆంధ్రసాహిత్య చరిత్రలో స్వతంత్ర కావ్యరచనకు శ్రీకారం చుట్టినవాడు అని అంటారు. ఈ శివాలయ ప్రాంగణంలోనే ముస్లిం భక్తుడు సయ్యద్ షాబాజీ ఆలియా సమాధి, మసీదు ఉండడం ఇక్కడ చెప్పుకోతగ్గ విశేషం!



రాజమండ్రి, గోదావరి రైలువంతెన

కాకినాడకు పడమరగా గోదావరీ నదీ తీరంలో **రాజమహేంద్రవరంగా** ప్రసిద్ధిగాంచిన **రాజమండ్రి** పట్టణం ఉన్నది. ఆంధ్రుల ఆదికావ్యం ఆంధ్రమహాభారతం రచించిన ఆదికవి నన్నయభట్టు రాజమహేంద్రవరాన్ని పాలించిన రాజరాజు ఆస్థానకవి. సాంస్కృతికంగానే కాకుండా ఇవాళ రాజమండ్రి వ్యాపార కేంద్రంగా కూడా అభివృద్ధిచెందింది. ముఖ్యంగా తివాసీలకూ, గంధపు చెక్కలతో తయారుచేసిన వస్తువులకూ పేరు గాంచింది. గోదావరి నదిమీది రైలు వంతెన మనదేశంలో రెండవ పొడవైన వంతెనగా ప్రసిద్ధి గాంచింది!

**రాజమండ్రి** నుంచి ఉత్తరంగా ప్రయాణం చేశామంటే **విశాఖపట్నం** చేరుకుంటాం. అటు పశ్చిమంగా రాటర్డ్యామ్, ఇటు తూర్పుగా టోక్యో – వీటికి మధ్య ఉన్న చాలా లోతైన పెద్ద ఓడరేవు విశాఖపట్నం. పరాక్రమానికి అధిదేవుడైన వైశాఖుడి పేరుమీదుగా దీనికి విశాఖ అని పేరు వచ్చింది. ఇక్కడి తీరంలో ఒకప్పుడు వైశాఖ మందిరం ఉండేదని చెబుతారు. బ్రిటిష్ వాళ్ళు దీనినొక పెద్ద ఓడరేవుగా మార్చేంతవరకు ఇదొక చిన్న పల్లెకారుల గ్రామంగా ఉండేది. ఇవాళ విశాఖపట్నం ఒక పారిశ్రామిక నగరంగా అభివృద్ధి గాంచింది. మన దేశంలోని అతిపెద్ద నౌకా నిర్మాణ సంస్థ హిందూస్థాన్ షిప్‌యార్డ్ లిమిటెడ్ ఇక్కడ 1952వ సం॥లో స్థాపించబడింది. ఈ నగరానికి ప్రసిద్ధమైన కొండగుర్తు ఇక్కడి డాల్ఫిన్స్ నోస్. 358 మీ॥ ఎత్తయిన బండ సముద్రంలోకి చొచ్చుకుపోయి డాల్ఫిన్ ముక్కులాగా కనిపిస్తుంది. బ్రహ్మాండమైన ఈ బండ మీద 'లైట్‌హౌస్' నిర్మించారు. దీని వెలుతురు సముద్రంలో 65.5. కి.మీ. వరకు కనిపిస్తుంది. ఇది మనదేశంలోనే చాలా శక్తివంతమైన 'లైట్‌హౌస్.'



నౌకానిర్మాణ సంస్థ, విశాఖపట్నం

విశాఖపట్నానికి జంటనగరంగా చెప్పుకునే **వాల్తేరు** ఇక్కడికి మూడు కి.మీ. దూరంలో ఉన్నది. ఇక్కడి ఆహ్లాదకరమైన వాతావరణం దీనినొక 'ఆరోగ్య కేంద్రం' గా చేస్తున్నది. ఇక్కడే ఆంధ్ర విశ్వ విద్యాలయం కూడా ఉన్నది. బంగారం రంగు ఇసుకతో నిండిన అందమైన రామకృష్ణ మిషన్ బీచ్, ఋషికొండ బీచ్, లాసన్ బే అనే మూడు తీరాలు విశాఖపట్నానికి మరింత శోభను కలిగిస్తున్నాయి.

విశాఖపట్నానికి 14 కి.మీ. దూరంలో **సింహాచల క్షేత్రం** ఉన్నది. ఇక్కడి కొండమీద నరసింహస్వామి ఆలయం ఉన్నది. ఈ దేవాలయాన్ని 14వ శతాబ్దంలో నిర్మించారు. పురాణాల ప్రకారం – హిరణ్యకశిపుడనే రాక్షసరాజు, మితిమించిన అహంకారంతో విష్ణుభక్తిని నిషేధించాడు. విష్ణుభక్తులను వేధించాడు.

డాల్ఫిన్స్ నోస్



హిరణ్యకశిపుడు తన కుమారుడైన ప్రహ్లాదుడు నిరంతరం నారాయణ నామస్మరణ చేయడం చూసి సహించలేక పోయాడు. అతనికి నయానా, భయానా చెప్పి చూశాడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఆఖరికి కన్నబిడ్డను హతమార్చడానికి పూనుకున్నాడు. కాని అతన్ని ఎలాగూ చంపలేకపోయాడు. చివరికి ప్రహ్లాదుణ్ణి సముద్రంలోకి తోసి, అతని తల మీద 'సింహాచలం' కొండను ఉంచాడట. కాని ఆ ఆపద నుంచి కూడా మహావిష్ణువు తన భక్తుణ్ణి కాపాడాడు. అంతేకాదు, హిరణ్యకశివుడి దుర్మార్గం మితిమించడంతో మహావిష్ణువు నరసింహావతారమెత్తి వాణ్ణి సంహరించాడు. అయినా, ఆయన ఆగ్రహం చల్లారలేదు. దేవతలందరూ ప్రార్థించారు. ప్రియభక్తుడు ప్రహ్లాదుడు స్తుతించాడు. ఆఖరికి పరమశివుడు 'శరభ' పక్షిరూపం దాల్చి వచ్చి ఉగ్రనరసింహమూర్తిని శాంతింప చేశాడు.

సింహాచల దేవాలయ గర్భగృహంలోని నరసింహస్వామి విగ్రహ ఉగ్రరూపాన్ని శాంతింప చేయడానికి యేడాది పొడవునా శ్రీగంధ లేపనంతో మూసి ఉంచుతారు. యేడాదికి ఒక్కసారి మాత్రం చందనయాత్ర ఉత్సవ సమయంలో ఈ శ్రీ గంధ కవచాన్ని తొలగిస్తారు. ఏప్రిల్– మే నెలల మధ్యజరిగే ఈ ఉత్సవకాలంలో స్వామిని దర్శించడానికి ప్రజలు దేశం నలుమూలల నుంచి తండోపతండాలుగా వస్తారు.

లాసన్స్ బే





# కలనిజమైంది!

చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న కిరీటిని, వాడి తాత అష్టకష్టాలు పడి పెంచి పెద్దచేశాడు. పద్ధెనిమిదేళ్ళ వయసు వచ్చినా, తాత గారాబంలో పెరిగిన కిరీటికిబాధ్యతలు, ఇంటి పరిస్థితులు తెలియవు. తాత హఠాత్తుగా జబ్బుపడి మంచం పట్టేసరికి, వైద్యానికీ మందూ మాకులకూ డబ్బులేకపోవడంతో, అప్పుడు ఇంటి స్థితిగతులు అర్థమయినై, కిరీటికి.

కిరీటికి డబ్బుకోసం, ఇంటిని అమ్మకానికి పెట్టడంతప్ప మరొకదారి కనబడలేదు. అయితే, తాత అందుకు అభ్యంతరం చెబుతూ, "ఇక, ఈ ఘటం వెళ్ళి పోతుందిరా, బాబూ! నాకోసం వున్న ఇంటిని అమ్మి, తర్వాత చిక్కులపాలు కాకు," అన్నాడు.

"నువ్వు లేకుండా నేనెలా బతగ్గలను, తాతా! డబ్బు ఏదోవిధంగా సంపాదించగలమేమోకాని, పోయిన ప్రాణాన్ని తిరిగితేలేం కదా. నువ్వు నా కోసం బతకాలి," అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు కిరీటి.

తర్వాతవాడు ఇల్లు అమ్మిన డబ్బుతో పట్నంనుంచి వైద్యుణ్ణి రప్పించాడు. మంచి మందులు తెప్పించాడు. అయినా, మాసం తిరక్కుండానే కన్నుమూశాడు తాత. వైద్యం ఖర్చులకు పోగా మరికొంత డబ్బు చేతిలో వుండడంతో కిరీటి, తాత శ్రాద్ధకర్మలు ఘనంగా చేశాడు.

వారంరోజులుగడిచినై. ఇప్పుడు బతుకు తెరువుకు ఏం చేయాలా అన్న సమస్య కిరీటికి ఎదురైంది. వాడు ఒకనాటి ఉదయం వేళ, ఊరి బయటికిపోయి, ఒక బండ రాయి మీద కూర్చుని, తనదగ్గర వున్న డబ్బు లెక్కచూసుకున్నాడు. సరిగ్గా ఇరవై వెండి కాసులున్నాయి. ఇకపై తను ఎలా బతకాలా అని వాడు చింతిస్తూండగా,

మాచిరాజు కామేశ్వరరావు



దారిన వెళుతున్న కోయవాడొకడు కిరీటి మొహంలోమొహంపెట్టిచూసి, "మొహంలో రాచబిడ్డ కళ మెరుస్తున్నది. వాలకంచూస్తే పేదవాడిలా కనిపిస్తున్నావు. దిగులుపడకు! మంచిరోజులు ముందున్నాయి!" అంటూ కిరీటి ముందు కుప్పలావున్న కాసుల్లోంచి ఒకటి తీసుకుని, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఆ పగలంతా కోయవాడి మాటల్ని మననం చేసుకుంటున్న కిరీటికి, రాత్రి కలలో తలమీద వజ్రాలు పొదిగిన కిరీటం కనిపించి మెలుకువ వచ్చింది. దూరంగా తొలికోడి కూస్తున్నది. తెల్లవారుజామున వచ్చిన కలలు నిజమవుతాయని తాత చెప్పిన సంగతి, వాడికి గుర్తుకొచ్చింది.తను ఈఊళ్ళోవుంటే రాజుకాగలగడం కల్లగదా!

కిరీటి అప్పటికప్పుడు, పుట్టి పెరిగిన ఊరును విడిచి, రాజధానీ నగరానికి ప్రయాణమయ్యాడు. వాడు మూడుపగళ్ళు, మూడురాత్రులు పట్టుదలగానడిచి, నాలు గోరోజు మిట్టమధ్యాహ్నం వేళకు, రాజధానీ నగరం చేరాడు. దారి ఖర్చులకు పోగా, ఇంకావాడి దగ్గర మూడు కాసులు మాత్రం మిగిలి వున్నాయి. ఆకలిగా వుండడంతో వాడు దాపుల కనిపించిన ఒక పూటకూళ్ళ బసలోకి వెళ్ళాడు.

ఆసరికే విస్తళ్ళల్లో పదిమందికి వడ్డన చేస్తున్నది పేదరాశిపెద్దమ్మ. ఆమె కిరీటి దగ్గర ఒకకాసుతీసుకుని ఒకమూల అరి టాకు పరిచి, వాడికి కూడా వడ్డనచేసింది. అక్కడ వున్న వాళ్ళల్లో ఇద్దరు, తరుచూ పూటకూళ్ళ బసకు వచ్చేవాళ్ళు. వాళ్ళల్లో ఒకడు పెద్దమ్మతో, "అవునుగానీ, పెద్దమ్మా! నీ మొహంలో ఏదో దిగులు కనిపిస్తున్న దేమిటి? క్రితంసారి వచ్చినప్పుడు, మీరాజు గారు రాచపుండుతో బాధపడుతున్నారని చెప్పావు. అదిగాని ఇంకా నయంకాలేదా?" అన్నాడు

పెద్దమ్మ దీర్ఘంగా నిట్టూర్చి, "పొరుగు రాజు ఆస్థానవైద్యుడి పుణ్యాన, మారాజు గారికి రాచపుండునయమై గండంతప్పింది. ఇప్పుడు మా యువరాణి పెళ్ళి సమస్య వేధిస్తున్నది. ఆమెకు తరచూ ఒకే రకం కలవస్తున్నదట. తను ఒంటరిగా దేవీఆల యానికి వెళుతూండగా, ఒక నల్లతాచు పాము ఆమెను కాటువేయబోవడం, ఒక యువకుడు దాని బారినుంచి ఆమెను కాపాడడం రోజూ కలలో కనిపిస్తున్నదట.

వచ్చిన సంబంధాలన్నీ తిరస్కరిస్తున్నది. నల్లతాచు నుంచి తనను కాపాడినవాడినే వివాహంచేసుకుంటుందట. ఇంతవరకూ దేవీఆలయానికి పోయేదారిలో, ఆమెకు ఒక్కగానొక్క వానపాము కూడా కనబడిన పాపానపోలేదు," అన్నది.

అంతా విన్న కిరీటి, తన రొట్టె విరిగి నేతిలో పడినంతగా ఆనందపడ్డాడు. వాడు త్వరగా భోజనం ముగించి, పాములుపట్టే వాళ్ళను వెతుకుతూ బయలుదేరాడు. వాడికి పాములపాపన్న అనేవాడు కనిపించాడు. కిరీటి వాడి గుడిసె ముందుకు పోయి, "నాకు కోరలు పీకిన నల్ల తాచు కావాలి, వున్నదా?" అని అడిగాడు.

"లేకేం, రెండు కాసులవుతుంది," అన్నాడు పాపన్న.

కిరీటి అతడికి తన దగ్గర మిగిలివున్న రెండు కాసులు ఇచ్చి, పాపన్న బుట్టలో పెట్టిన పామును తీసుకుని, కొండ ఎక్కి, ఒకచోట పొదలమాటున దాక్కుని, వచ్చే పోయే వాళ్ళను పరీక్షగా చూడసాగాడు.

కొంతసేపటికి ఇద్దరుయువతులు, దేవీఆలయానికి పోతూ కనిపించారు. వాళ్ళల్లో యువరాణి లేదు. సూర్యాస్తమయమై, క్రమంగా చీకటి పడసాగింది. ఆ సమయంలో మిలమిలమెరిసే దుస్తుల్లో యువరాణి, దేవీఆలయానికేసి పోతూ వాడికంట బడింది. వెంటనే కిరీటి పొదల మాటునుంచి పామును, యువరాణిమీద పడేలా విసిరి వేశాడు, పాము భుజంమీద పడగానే యువరాణి కెవ్వుమన్నది. మరుక్షణం కిరీటి పొదలమాటు నుంచిముందుకు దూకి, పామును వడిసి పట్టుకుని దూరంగా విసిరివేశాడు.



యువరాణికొద్దిసేపటికి తెప్పరిల్లి, కిరీటి కేసి చూస్తూ, "ఆహాఁ, కల నిజమైంది! నువ్వే నా భర్తవు," అన్నది.

"అదేమిటి?" అని, ఏమీ తెలియనట్టు ఆశ్చర్యం నటించాడు కిరీటి.

అప్పుడు యువరాణి తనకు రోజూ వస్తున్న కలగురించి, కిరీటికిచెప్పి, "నన్ను నల్లతాచుపాము బారినుంచి రక్షించిన వాడినే వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. ఇప్పుడు నువ్వు కాదంటే, ఆజన్మాంతం బ్రహ్మచారిణిగా వుండిపోతాను," అంటూ కళ్ళుతుడుచుకున్నది.

కిరీటి బ్రహ్మానందపడిపోతూయువరాణి చేయిపట్టుకున్నాడు. అప్పటి కప్పుడు

ఇద్దరూ దేవీఆలయంలో అర్చకుడుఅం దించిన మందారమాలలు మార్చుకుని భార్యాభర్తలై పోయారు. కిరీటి చేయిపట్టు కుని కొండ దిగసాగింది యువరాణి. ఇదంతాకల అనిపించింది కిరీటికి. ఇద్దరూ తిరిగి పేదరాసి పెద్దమ్మ ఇంట్లోకి అడుగు పెట్టాక, ఈ లోకంలోకి వచ్చాడు వాడు.

"ఇక్కడికి తీసుకు వచ్చావేం! పెద్దమ్మ నీకు తెలుసా?" అని కిరీటి, యువరాణిని ఆశ్చర్యంగా అడిగాడు.

యువరాణినవ్వి, "అలనాడెప్పుడో గోదా వరి పుష్కరాల తొక్కిసలాటలో, తల్లిదం డ్రుల నుంచి వేరుపడి, నాలుగేళ్ళ పిల్లగా, ఈపెద్దమ్మకు దొరికాను. ప్రేమతో పెంచి ఇంతదాన్ని చేసింది," అన్నది.

"అయితే, నువ్వు యువరాణివి కాదా?" అంటూ విభ్రాంతిగా అడిగాడు కిరీటి.

"నా పేరు యువరాణీయే! అనుమానం దేనికి?" అంటూఆశ్చర్యపోయింది, యువ రాణి.

"నువ్వు పెద్దమ్మ పెంపుడు కూతురు వయినప్పుడు, ఈ రాచరికపుదుస్తులు నీ కెక్కడివి?" అనిఅడిగాడు కిరీటి. ఆ ప్రశ్నకు యువరాణి విరగబడి నవ్వుతూ, "నేను ఈ దేశపు యువరాణి ప్రధానసఖికి, ఇష్ట సఖినికదా! ఆకారణంగా యువరాణి, నాకు బాగాపరిచయం. ఆవిడపాతదుస్తులు అప్పు డప్పుడు అడిగి తీసుకుంటాను," అన్నది.

వంటగదిలో వుండి, ఈ సంభాషణంతా విన్న పేదరాసి పెద్దమ్మ పరమానందంచెంది, బయటకువస్తూ, యువరాణితో, "ఒసే, యువరాణీ! నాఒంట్లో ఓపిక తగ్గిపోతున్నది. రాజుగారి వంటశాలలాంటి, ఈ పూటకూళ్ళ బసను అల్లుడికి అప్పగించేస్తాను," అన్నది.

"ఈ యువరాణి వచ్చిన సంబంధాలన్నీ వద్దంటున్నది. దీనికి పెళ్ళి రాత వున్నదో లేదోఅని తెగబెంగపడ్డావుకదా! ఇప్పుడు సంతోషంగా వుందా?" అని అడిగింది యువరాణి.

పెద్దమ్మ, యువరాణి బుగ్గలు పుణికి, "ఇకనువ్వు యువరాణివి కాదే, పెళ్ళయిం దికదా, రాణీవే!" అన్నది మురిపెంగా.

స్వతంత్రంగా బతికే ఆధారం దొరికిన కిరీటి, "ఈ పెళ్ళితో నా కల కూడా నిజమైంది. రాణీగారి భర్త రాజేకదా!" అన్నాడు సంతోషంగా.






చందమామ

1. .. చిన్న జలచరాల ఎముకలతో ఏర్పడిన తెల్లటి నిటారు గుట్టలు ఎక్కడ ఉన్నాయి?
సముద్రాలలో నివసించిన ఈ జంతువుల తెల్లటిఎముకలు సముద్రం అడుగున ఒకటి మీద ఒకటిగా చేరి, లక్షలాది సంవత్సరాలలో క్రమంగా గట్టిపడి నిటారు బండలుగా తయారై, అవి భూమి కదలిక కారణంగా పైకి తోయబడ్డాయి.



# ప్రపంచంలో వీటిని మనం ఎక్కడ చూడగలం?

**2. .. స్థూపాన్ని పోలిన ధాన్యాగారం...?**
మన దేశంలోని ఈ ధాన్యాగారం తలుపు లోపలి వైపుకు మాత్రమే తెరవడానికి వీలవుతుంది. అంటే ధాన్యాగారం నిండా ధాన్యం ఉన్నప్పుడు దాని తలుపు తెరవడానికి వీలుపడదు. 17వ శతాబ్దంలో కరువు ఈ ప్రాంతాలలో విలయ తాండవం చేసినప్పుడు ఈస్టిండియా కంపెనీదీనినినిర్మించింది.



**3. .. ప్రపంచంలో. కెల్లాఎత్తయినవిగ్రహం...?**
రెండు చేతులూ సాచి, ఒక చేతితో ఖడ్గం ధరించిన భంగిమలో హుందాగాకనిపించే స్త్రీరూపంలోని విగ్రహం ఇది. ఈ విగ్రహంఎత్తు82మీ.





**4. ..అగ్నిపర్వతం బద్దలవడం వల్ల ఏర్పడిన కిరీటాకృతి కొండలలో నివసించే ప్రజలు...?**
దాదాపు పదిలక్షల సంవత్సరాలకు పూర్వం ఒక అగ్నిపర్వతం బద్దలవడం వల్ల ఎర్పడిన కిరీటాకృతి కొండలు అంతస్తులు, అంతస్తులుగా ఉన్న నగరం లాగా కనిపిస్తున్నది. ఈ మెత్తటి కొండలలో తొలచిన గుహలు నివాసగృహాలుగా ఉపయోగపడుతున్నాయి. మెత్తటి ఈ కొండలలో దైవ పీఠాలు, కుర్చీలు, మేజాలతో సహా చర్చ్‌లు, ఆశ్రమాలు కూడా తొలచబడిఉన్నాయి.

**5. ..అతిపెద్ద జాతీయ జంతు ప్రదర్శన శాల...?**
ఈ జంతు ప్రదర్శనశాలలో కనీసం 400 జాతుల పక్షులూ, 150 జాతుల నస్తన జంతువులూ, 50 జాతుల చేపలూ, 40 రకాల కప్పలూ, 34 రకాల పాములూ ఉన్నాయి. 19, 455 చ.కి.మీ విస్తీర్ణం గల ఈ జంతు ప్రదర్శనశాలలో దాదాపు 7000 ఏనుగులూ, 1500 సింహాలూ, 900 చిరుత పులులూ 250 మరొకజాతి (చీటా) చిరుత పులులూ ఉన్నాయి.



## చిత్ర ప్రహేళిక



1. పక్కవాటుగాకనిపిస్తున్న ఒకఅందమైన అమ్మాయి ముఖం ఇది. అయితే ఇందులో మరొక ముఖం కూడా దాగిఉన్నది. అదేమిటో కనుగొన గలరా?

2. యువకుడు సైకిలును చాలా వేగంగా నడుపుతున్నాడు. అయితే ఈ బొమ్మను గీయడంలో చిత్రకారుడు పొరబాటు చేశాడు. అదేమిటో పట్టుకోగలరా?

## కథాప్రహేళిక

**ఈ కథలో చిన్న పొరబాటు దొర్లింది. అదేమిటో చెప్ప గలరా?**

### చక్రవర్తి ఔదార్యం

చంద్రగుప్తుడి మనమడు అశోక చక్రవర్తి ఒకనాటి సాయం కాలం ఉద్యానవనంలో విహరి స్తూండగా ఉన్నట్టుండి ఆయన వీపు మీద ఒక రాయి వచ్చి పడింది. మరుక్షణమే అశోకుడి అంగరక్షకులు, ఆ రాయి విసి రిన వ్యక్తిని తెచ్చి ఆయన ముందు నిలిపారు. భయంతో వణికిపోతూన్న ఆ స్త్రీ, "మహా ప్రభువులు క్షమించాలి. ఇది తెలియక చేసిన అప రాధం. పొద్దుట్నుంచి పిల్లలు ఆకలితో అలమటి స్తున్నారు. వాళ్ళకోసం జామపళ్ళకని ఆ చెట్టు మీదికి రాయి విసిరాను. అది గురితప్పి మీమీద పడింది!" అన్నది దీనంగా.

"వెంటనే ఆమెకు నూరు వెండి నాణాలిచ్చి పంపండి!" అని అశోకుడు మంత్రిని ఆజ్ఞాపించాడు.

"మహాప్రభూ! ఆమె తమపై రాయి విసిరింది. అందుకు శిక్ష విధించాలి. అంతే కాని, ఇలా బహూక రించడం..." అని ఏదో అనబో యాడు మంత్రి.

"ఆమె విసిరిన ఆ రాయి చెట్టుకు తగిలి ఉంటే ఆ చెట్టు పేదరాలికి జామపళ్ళి చ్చేది కదా? మరి, రాజైన వాడు ఆ జామ చెట్టు కన్నా ఔదార్యం కలిగి ఉండాలి కదా!" అన్నాడు అశోకుడు చిన్నగా నవ్వుతూ.

సమాధానం: ______



# సరదా ప్రశ్నలు

1. 12 మంది పిల్లలను వరుసకు నలుగురు ప్రకారం నాలుగు వరుసలుగా నిలబెట్టడం ఎలా?





2. మీరు మీ ఎడమ పాదం, ఎడమ భుజం గోడకు ఆనుకుని ఉన్నట్టు నిలబడి ఉన్నప్పుడు, మిమ్మల్ని కుడిపాదం పైకెత్త మంటే ఎత్త గలరా?

3. ఊహాకల్పిత జంతువుల పేర్లు కొన్ని తారుమారై ఉన్నాయి. ఆయా పేర్లను సరైన చోట అమర్చ గలరేమో చూడండి.



ఎ) యూనికార్న్



బి) బాసిలిస్క్



సి) డ్రాగన్

డి) ఫోనిక్స్

4. రెండు ఎర్రనివి, మూడునల్లనివి కలిపి 5 టోపీలున్నాయి. మోహన్, రాము, వినయ్ ఈ ముగ్గురూ మూడు టోపీలు పెట్టుకున్నారు. మిగతా రెండు టోపీలు కనబడకుండా చాటులో ఉన్నాయి.



వినయ్, మోహన్ కనిపించే స్థానంలో రాము కూర్చున్నాడు. వినయ్ మోహన్‌ను మాత్రమే చూడగలడు. మోహన్‌కు వాళ్ళిద్దరూ కనిపించడంలేదు. అయినప్పటికీ, ఈ ముగ్గురు కూడా ఒకరు మాట్లాడితే మరొకరు వినగలరు. రామును నువ్వు ఏ రంగు టోపీ పెట్టుకున్నావు? అని అడిగితే నాకు తెలియదన్నాడు. వినయ్‌కి కూడా పెట్టుకున్న టోపీ రంగు ఏదో తెలియదు. కాని అతడు రాము సమాధానం విన్న వెంటనే తను పెట్టుకున్న టోపీ రంగు నలుపు అని గ్రహించగలిగాడు. అతడు ఆ నిర్ణయానికి ఎలా రాగలిగాడు?

## బొమ్మవేసి చూద్దాం — P నుంచి గుడ్లగూబ

మీరు సులభమైన నాలుగు అంచెలలో 'P' ని నిద్రమత్తులో వున్న గుడ్లగూబగా మార్చవచ్చు. అది ఎలాగో ఇక్కడ చూడండి:




### బంగారు గడియలు- 13 సమాధానాలు

**ప్రపంచంలో ఎక్కడ**

1. నైరుతి ఫ్రాన్స్‌లోని లాస్కాక్స్‌లో.
2. రాజస్థాన్‌లోని చిత్తోర్‌ఘడ్.
3. ఆఫ్రికా (మౌంట్ కిలిమంజారో) ఉత్తర టాంజానియా.
4. మియాన్మార్ (బర్మా)
5. అమెరికాలోని వాషింగ్టన్ డి.సి.

**చిత్రప్రహేళిక**

ఆఫ్రికా అడవులలో పులులు లేవు.

**పిక్చర్ క్విజ్**

1. సౌదీ అరేబియా, 2. చైనా 3. ఈజిప్ట్ 4. జర్మనీ 5. బొలీవియా 6. జింబాబ్వే
7.స్పెయిన్ 8. మియాన్మార్ 9. మడగాస్కర్.

**సరదా ప్రశ్నలు:**

1. 50 పైసలు, 5 పైసలు. ఒక నాణెం 50 పైసలు కాదు. అయితే రెండవది 50 పైసలు.
2. చిలుక చెవిటిది.
3. కుటుంబంలో ఆరుగురు సభ్యులున్నారు.
4. గ్రీన్‌ల్యాండ్. కనుగొనబడకపోయినా అది ఉన్నది కదా!!
5. ఇద్దరు మిత్రుల్ని ఒకేసారి తీసుకెళ్ళడం. అప్పుడు మూడు టిక్కెట్లకు ఖర్చుచేయవలసిఉంటుంది. ఒక మిత్రుణ్ణి రెండుసార్లు తీసుకెళితే మీ కోసం రెండుసార్లు టిక్కెట్లు కొనవలసి వస్తుంది.
6. ఆఖరి అమ్మాయికి పెట్టెతో సహా ఆపిల్ ఇవ్వాలి.
7. అబద్ధాలాడేవాడు. అతడు అలాంటి సంభాషణను వినివుండలేదు. అబద్ధాలాడేవాడు ఆమె అబద్ధాలకోరు అని నిజం చెప్పడు. నిజం చెప్పేవాడు అబద్ధాలాడేవాడని చెప్పకోడు.
8. పెద్ద పాదం కలవారికి.




పాండవుల అరణ్యవాసం పన్నెండో ఏడు పూర్తి కాబోతున్నది. ఇంద్రుడు పాండవులకు మేలు చేసే ఉద్దేశంతో బ్రాహ్మణ రూపంలో కర్ణుడి వద్దకువెళ్ళి, అతని సహజ కవచకుండలాలు యాచించాలని నిశ్చయించాడు. ఈ సంగతికర్ణుడి తండ్రి అయిన సూర్యుడికి తెలిసింది. సూర్యుడు ఒకనాటి వేకువజామున కర్ణుడికి కలలో కనిపించి, "కర్ణా, నువ్వు బ్రాహ్మణులకు ఏది అడిగినా ఇస్తావు. అందుచేత ఇంద్రుడు నీ దగ్గరికి బ్రాహ్మణ వేషంలో వచ్చి, నీ సహజ కవచకుండలాలు దానం అడుగుతాడు. ఆయనకు మరేదన్నా ఇయ్యిగాని కవచకుండలాలియ్యకు. అవి ఉన్నంత కాలమూ నిన్ను ఎవరూ యుద్ధంలో చంపలేరు. అవి పోతే మాత్రం నీకుతప్పక చావుకలుగుతుంది," అని చెప్పాడు.

"దేవా, నువ్వు స్వయంగా వచ్చి నాకు హితబోధ చెయ్యటమే నాకు పదివేలు. కాని, బ్రాహ్మణులు అడిగినది ఇవ్వటం నావ్రతం. దీని మూలాన లోకంలో నాకు ఖ్యాతి వచ్చింది. అలాటప్పుడు దేవేంద్రుడంతటి వాడు వచ్చి నా సహజ కవచకుండలాలు అడిగితే ఎలా ఇయ్యకుండా ఉంటాను? అందుచేత తప్పక ఇస్తాను. దానివల్ల నా కీర్తి మరింత పెరుగుతుంది. పాండవులకు అపకీర్తి వస్తుంది. కీర్తిపోయాక బతికిఉండి మాత్రం లాభమేమిటి?" అన్నాడు కర్ణుడు.

"పిచ్చివాడా, శరీరమే పోయాక కీర్తితో ఏం పని? అది శవాలంకరణ లాటిది. నీకూ, అర్జునుడికీ తప్పక యుద్ధం కలుగుతుంది. నీకు కవచకుండలాలు ఉన్నంత కాలమూ అర్జునుడు ఇంద్రుణ్ణి తోడు తెచ్చుకున్నా నిన్ను గెలవలేడు. అందుచేత వాటిని ఇంద్రుడికి ఇవ్వవద్దు," అన్నాడు సూర్యుడు.

## 37. యక్షప్రశ్నలు



"దేవా, నన్ను క్షమించు. బ్రాహ్మణులు వచ్చి అడిగితే ప్రాణాలన్నా ఇవ్వాలన్నది నా నియమం. కవచకుండలాల సహాయం లేకుండానే నేను అర్జునుణ్ణి గెలవగలను. నావద్ద పరశురాముడూ, ద్రోణుడూ ఇచ్చిన అస్త్రాలు ఉన్నాయి," అన్నాడు కర్ణుడు.

"నీకు అంత పట్టుదలగా ఉంటే, ఒక పనిచెయ్యి. ఇంద్రుడి వద్ద ఒక అమోఘమైన శక్తి ఉన్నది. దానితో ఎలాటి శత్రువునైనా చంపవచ్చు. అది శత్రువునుచంపి తిరిగి వస్తుంది. ఇంద్రుడు నీ కవచకుండలాలు యాచించినప్పుడు నువ్వు ఆ శక్తిని అడుగు. దానితో నువ్వు అర్జునుణ్ణి గెలవగలుగుతావు," అన్నాడు సూర్యుడు.

ఇంతలో కర్ణుడు నిద్ర లేచి తెల్లవారుతూ ఉండటం గమనించి, ఇంద్రుడి రాకకు ఎదురుచూడసాగాడు. అతనురోజూ మధ్యాన్నంవేళ సూర్యోపాసన చేసి, బ్రాహ్మణులకు అడిగిన దానాలు చేసేవాడు. ఈ నాడు ఆ సమయంలో ఇంద్రుడు బ్రాహ్మణ వేషంలో వచ్చి, "భిక్షాం దేహి," అన్నాడు.

కర్ణుడు ఆయనను తన అలవాటు ప్రకారం పూజించి, "బ్రాహ్మణా, నీకు ఏం కావాలి? అందమైన స్త్రీలా? సారమైన భూములా? మంచి గోవులా? ఏది కావాలో కోరు," అన్నాడు.

"నాయనా, నాకు అవి ఏమీ వద్దు. నీ సహజ కవచమూ, కుండలాలూ కోసి ఇయ్యి," అన్నాడు ఇంద్రుడు.

"బ్రాహ్మణోత్తమా, ఈ కవచకుండలాలు నా ప్రాణాన్ని కాపాడేవి. ఇవిగాక మరేదైనా కోరు," అన్నాడు కర్ణుడు.

"కాదు, నాకు నీ కవచకుండలాలే కావాలి," అన్నాడు ఇంద్రుడు.

కర్ణుడు నవ్వి, "నువ్వు ఇంద్రుడివని నాకు తెలుసు. మా వంటి వారికి వరాలు ఇవ్వవలసిన నువ్వు ఇలా యాచనకు దిగటం బాగాలేదు. నీకు నేను కవచకుండలాలు ఇచ్చేసినట్టయితే శత్రువులకుతేలికగా ఓడి, అపఖ్యాతి పాలవుతాను. నాకు అమోఘమైన నీ శక్తిని ఇయ్యి," అన్నాడు.

దానికి ఇంద్రుడు, "నా శక్తిని అలాగే ఇస్తాను. కాని నువ్వు దానిని ఒక్కణ్ణి చంపటానికి మాత్రమే ఉపయోగించగలుగుతావు. నువ్వు ప్రయోగించగానే అది నీ శత్రువును చంపి నా దగ్గరికితిరిగి వచ్చేస్తుంది. దానికి అభ్యంతరం లేకపోతే తీసుకో," అన్నాడు.

"నాకు ఉన్న శత్రువు ఒక్కడే. అతన్ని చంపటమే నా కోరిక," అన్నాడు కర్ణుడు.

"నాకు తెలుసు. ఈ శక్తితో అర్జునుణ్ణి చంపాలనుకుంటున్నావు. కాని కృష్ణుడు అతనికి అండగా ఉండగా అతన్నిచంపటం నీకు సాధ్యం కాదు. ఏమయినా, నేనిచ్చే శక్తిని ప్రాణాపాయ సమయంలో, నీవద్ద ఉండే ఇతర అస్త్రాలేవీ పనికిరానప్పుడు మాత్రమే ఉపయోగించు. తొందరపడి అనామకులపైన గాని, అనవసరంగాగాని ప్రయోగిస్తే ఈ శక్తి నీప్రాణాలే తీస్తుంది," అని హెచ్చరించాడు ఇంద్రుడు.

తన శరీరంతో పుట్టి పెరిగిన కవచ కుండలాలను కోసి ఇచ్చినప్పుడు తనకు వికృతరూపం కలగకుండా చెయ్యమని కర్ణుడు కోరాడు. ఇంద్రుడు సరేనన్నాడు. కర్ణుడు ఇంద్రుడి నుంచి శక్తి గ్రహించి, ఆయనకు తన శరీరంనుంచి కవచాన్నీ, కుండలాలనూ కోసి ఇచ్చాడు.

కర్ణుడి కవచకుండలాలు పోయాయన్న వార్త తెలిసి పాండవులు పరమానందం చెందారు. కౌరవులు దుఃఖించారు.

పాండవులు ద్వైతవనంలో ఉంటూ ఉండగా ఒక బ్రాహ్మణుడు పరిగెత్తు కుంటూవచ్చి, "నేను అరణిని ఒక చెట్టు కొమ్మకు తగిలించాను. ఇంతలో ఒక దుప్పి వచ్చి ఆ చెట్టును తన శరీరంతో రుద్దుతూఉండగా నా అరణి దానికొమ్ము లకు తగులుకున్నది. ఆ దుప్పి నా అర ణితో సహా పారిపోతున్నది. అది లేకుండా నా అగ్నికార్యం సాగదు. దయచేసి నా అరణిని నాకు తెచ్చి ఇయ్యండి," అన్నాడు.



వెంటనే పాండవులు ఆ దుప్పి వెంట పరిగెత్తి, దాన్ని బాణాలతో కొట్టారు. కాని ఒక్క బాణమూ ఆ దుప్పికి తగలలేదు. అది అంతకంతకూ వారికి దూరమై, చివరకు కీకారణ్యంలో కనబడకుండాపోయింది.

పాండవులు అయిదుగురూ అలిసి పోయి, ఆకలి దప్పులతో బాధపడుతూ ఒక చెట్టు నీడన చతికిలబడ్డారు. అప్పుడు నకులుడు, "మనకిలా కష్టాల మీద కష్టాలు రావటానికి అసలు కారణమేమిటో?" అన్నాడు.

"పూర్వజన్మలో చేసుకున్న దుష్కృత్యాల వల్ల ఈ జన్మలో కష్టాలుకలుగుతాయి," అన్నాడు ధర్మరాజు.

"ఆనాడు ద్రౌపదిని సభలోకి తెచ్చి నప్పుడే నేనా దుర్మార్గులను చంపకపో



వటం చేత ఇలా అగచాట్లు పడుతున్నాం," అన్నాడు భీముడు.

"జూదం ఆడేటప్పుడు కర్ణుడు పేలిన మాటలను నేను శాంతంగా సహించటం వల్ల మనం అప్రయోజకులమల్లే అరణ్యానికి వచ్చామేమో, అవస్థలు పడుతున్నాం," అన్నాడు అర్జునుడు.

"ఆ శకునిగాణ్ణి అప్పుడే చంపేసి ఉంటే మనకే పాట్లూ ఉండేవి కావు," అన్నాడు సహదేవుడు.

ధర్మరాజు నకులుణ్ణి చూసి, "అందరికీ దాహంగా ఉన్నది. ఈ చెట్టెక్కి, ఎక్కడన్నా నీరున్నదేమోచూసి, బాణాల పొదితో నీరు తీసుకురా," అన్నాడు.

నకులుడు చెట్టెక్కి, దగ్గరలోనే నీరున్న జాడలుతెలుసుకుని, అక్కడికి వెళ్ళి తాను దాహం తీర్చుకుని, మిగిలినవారికి నీరు తెచ్చి పెట్టటానికి బయలుదేరాడు. అతను ఒక సరోవరాన్ని చేరుకుని, నీరు తాగబో తూండగా, ఏదో అశరీరవాక్కు, "అగు! నేనడగిన ప్రశ్నలకు సమాధానం చెప్పి నీరుతాగు. ఈ సరస్సు నాది," అన్నది.

నకులుడు ఆ మాటలను లక్ష్యపెట్టక, నీరు తాగి, మూర్ఛపోయాడు. అతను ఎంతకూ రాకపోయేసరికి ధర్మరాజు సహదేవుణ్ణి పంపాడు. సహదేవుడు కూడా సరస్సును చేరుతూనే, చచ్చిపోయినట్టు పడిఉన్న నకులుణ్ణి చూసి ఆవేదనపడుతూ, దాహబాధ భరించక లేక, అశరీరవాణి మాటలు పెడచెవిని బెట్టి, నీరు తాగి, తాను కూడా పడిపోయాడు.

తరవాత ధర్మరాజు, వెళ్ళినవారి జాడ తెలుసుకురమ్మని అర్జునుణ్ణి పంపాడు. అర్జునుడు సరస్సు చేరి తమ్ములను చూశాడు. వారిని అలా చేసినవారుఎవరా అని చుట్టూ చూస్తే ఎక్కడా ఒక పిట్టకూడా లేదు. దాహబాధకు తాళలేక అతనునీరు తాగబోతూండగా అతనికి కూడా అదృశ్య వాక్కులు వినిపించాయి.

"సామర్థ్యం ఉంటే నా ఎదట కనబడు. అదృశ్యంగాఉండి మాట్లాడుతావెందుకు?" అంటూ అర్జునుడు ధ్వని వచ్చిన దిక్కుగా బాణాలు వేసి, నీరుతాగి తానుకూడా పడిపోయాడు. అతని తరవాత భీముడు వచ్చి, అశరీరవాక్కులను పెడచెవినిబెట్టి, నీరుతాగి పడిపోయాడు.

చివరకు ధర్మరాజు స్వయంగా బయలుదేరి సరస్సు వద్ద ప్రాణాలు లేకుండా



పడి ఉన్న తమ్ముళ్లనుచూసి దుఃఖిం చాడు. అప్పుడు అశరీర వాక్కు ఇలా అన్నది.

"నేనొక కొంగను, నేనీ సరస్సులో చేపలను తిని జీవిస్తూ ఉంటాను. నా ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా నీరు తాగినందుకు నీ తమ్ములను చంపాను. నువ్వయినా నా ప్రశ్నలకు సమాధానాలు చెప్పి నీకు కావలసినంత నీరు తీసుకో. లేదా, నీకు కూడా వారి గతే పట్టుతుంది."

ఈ మాటలు విని ధర్మరాజు, "నా తమ్ములు ఒక పక్షి చేత చచ్చేవారుకారు. నువ్వు కొంగవు కావు. నువ్వు ఎవరు? నీకేం కావాలి?" అని అడిగాడు.

"అవును, నేను కొంగను కాను, యక్ష రాజును," అంటూ ఆ యక్షుడు తాడి ప్రమాణాన సరస్సు ఒడ్డున ధర్మరాజుకు కనిపించి, "నీకు నీరు కావాలంటే నా ప్రశ్నలకు సరి అయిన సమాధానాలియ్యి." అన్నాడు.

"అడుగు, నాకు సాధ్యమైతే చెబుతాను," అన్నాడు ధర్మరాజు.

యక్షుడు అనేక ప్రశ్నలు వేశాడు. ధర్మ రాజు చెప్పిన సమాధానాలు యక్షుణ్ణి తృప్తి పరిచాయి.

"నీ సమాధానాలకు సంతోషించాను. చచ్చిపోయిన నీ తమ్ములలో ఒక్కణ్ణి బతికిస్తాను. ఎవణ్ణి బతికించమంటావో కోరుకో," అన్నాడు యక్షుడు.

"యక్షరాజా, నకులుణ్ణి బతికించు," అన్నాడు ధర్మరాజు.

"మహాబలుడైన భీముణ్ణీ, మహా పరా క్రమశాలి అయిన అర్జునుణ్ణీ వదిలి, నీ సవతితల్లి కొడుకైన నకులుణ్ణి ఎందుకు బతికించమంటున్నావు?" అని యక్షుడు అడిగాడు.

"మా తండ్రికి కుంతీ, మాద్రీ ఇద్దరు భార్యలు. కుంతి కొడుకులలో నేను బతికి ఉన్నాను. మాద్రి కొడుకులలో ఒకడు బతికి ఉండట ధర్మమని నాకు తోచింది," అన్నాడు ధర్మరాజు.

"మంచిది, ధర్మద్రోహం చెయ్యకపోవ టమే ఉత్తమ ధర్మంగా భావించావు. నీ తమ్ములందరినీ బతికిస్తాను," అన్నాడు యక్షుడు.

వెంటనే భీమార్జున నకుల సహదేవులు నిద్రలేచినట్టు లేచి కూర్చున్నారు. వారిలో ఆకలిదప్పుల జాడ కూడా లేదు.

"అయ్యా, నువ్వు మామూలు యక్షు డవు కావు, ఏ దేవతవో చెప్పు," అని ధర్మరాజు అడిగాడు.

దానికా యక్షుడు, "నేను ధర్మదేవతను. నీ తండ్రిని. నిన్ను పరీక్షించటానికి వచ్చాను," అన్నాడు.

"దేవా, ఒక బ్రాహ్మణుడి అరణిని ఒక దుప్పి తీసుకుని పారిపోయింది. అది లేకుండా ఆయన అగ్నికార్యం చేయలేడు. ఆయన దైనిక కర్మకాండకు విఘ్నం రాకుండా అనుగ్రహించు," అన్నాడు ధర్మరాజు.

"నేనే ఆ దుప్పిని. మిమ్ములను ఇక్కడికి రప్పించేందుకు ఆ పని చేశాను. ఇదిగో ఆ బ్రాహ్మణుడి అరణి. ఏదన్నా వరం కోరుకో, ఇస్తాను," అన్నాడు ధర్మదేవత.

"మా పన్నెండేళ్ళ వనవాసం పూర్తి అవుతున్నది. అజ్ఞాతవాసకాలంలో మమ్మల్ని ఎవరూ గుర్తించకుండా అనుగ్రహించు," అన్నాడు ధర్మరాజు.

పాండవులు అరణిని తీసుకుపోయి, దాన్నిపోగొట్టుకున్న బ్రాహ్మణుడికి ఇచ్చారు. తన అగ్నికార్యానికి భంగం రాకుండా కాపాడినందుకు ఆ బ్రాహ్మణుడు పాండవులకు తనకృతజ్ఞత తెలుపుకుని, వారికి విజయం చేకూరాలని ఆశీర్వదించి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

త్వరలోనే పాండవుల వనవాసం ముగిసింది. వాళ్ళు తమ వెంట ఇంతకాలమూ ఉండిన బ్రాహ్మణుల వద్ద సెలవు పుచ్చుకుని, వారికి నమస్కరించుతూ, "బ్రాహ్మణోత్తములారా, మా నియమం ప్రకారం ఇక నుంచీ ఏడాది పాటు అజ్ఞాతవాసం జరపాలి. అందుచేత మీ వద్ద సెలవు పుచ్చుకుంటున్నాము," అని చెప్పి, అజ్ఞాతవాసం నిర్విఘ్నంగా సాగేటట్టు వారి ఆశీర్వాదం పొందారు.

అప్పుడు ధౌమ్యుడు ధర్మరాజుతో, "త్వరలోనే మీ కష్టాలు తీరిపోతాయి," అన్నాడు.

పాండవులు ద్రౌపదినీ, ధౌమ్యుణ్ణీవెంటబెట్టుకుని తమ ఆశ్రమం నుంచి కోసు దూరం వెళ్ళి, అక్కడ ఏకాంతంగా, మర్నాటి నుంచీ తాము ప్రారంభించవలసిన అజ్ఞాతవాసం గురించి రహస్యచర్చలు చేశారు.



# చందమామ కబుర్లు

## స్వాగత సన్నాహాలు

2,000వ సం॥ డిసెంబర్ 31 నాటికి 20వ శతాబ్దం పూర్తవుతుంది. ఈ శతాబ్దపు తుది వెయ్యిరోజుల 'కౌంట్‌డౌన్' ఏప్రిల్ 6వ తేదీ ప్యారీస్ ఈఫిల్ టవర్‌లో ఆరంభమయింది. 21వ శతాబ్దానికి ఘనంగా స్వాగతం పలకడానికి ప్రపంచ వ్యాప్తంగా అన్ని నగరాలలోనూ భారీ ఎత్తున సన్నాహాలు ప్రారంభమయ్యాయి. 2,000వ సం॥ జనవరి 1వ తేదీ నుంచే ఈ ఉత్సవాలు ఆరంభమవుతాయి. ఈ శతాబ్దానికి మొట్టమొదట స్వాగతం పలికే అవకాశం న్యూజీల్యాండ్‌లోని ఓక్‌ల్యాండ్ నగరానికి లభించింది!

## ఎత్తయిన గోపురం

టాయ్‌వాన్ రాజధాని టాయ్‌పీ నగరంలో రెండేళ్ళలో ఒక ఇనుప గోపుర నిర్మాణం పూర్తవుతుంది. ఆ తరవాత అదే ఎత్తయిన గోపురంగా గిన్నిస్‌బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో చోటు చేసుకోగలదు. ఈ గోపురం ఎత్తు 550 మీ॥ ఇది ఇప్పుడు కెనడా, టొరొంటోలో వున్న చాలాఎత్తయిన సి.ఎన్. టవర్‌కన్నా 10మీ॥ ఎక్కువ ఎత్తు కలిగి ఉంటుంది. 73,000,000 అమెరికా డాలర్ల వ్యయంతో నిర్మించబడుతున్న ఈ టాయ్‌పీ టవర్ ముందు – ఇప్పుడు ఎత్తయినవిగా భావించబడుతూన్న టోక్యోటవర్ (333 మీ), ఈఫిల్ టవర్ (330 మీ) చిన్నవిగా కనిపిస్తాయి.

## అఖండ పారాయణం

ఈ సంవత్సరం ఏప్రిల్ 16వ తేదీ శ్రీరామనవమి ఉత్సవాలు జరిగాయి. అంతకు 5 రోజుల క్రితం కొందరు భక్తులు సరయూనదీ తీరంలో 'మహాయజ్ఞం' ప్రారంభించారు. శ్రీరామచంద్రుడు సరయూనదిని దాటి వనవాసానికి వెళ్ళినట్టు రామాయణం చెబుతుంది. ఇప్పుడు ప్రారంభించిన 'మహాయజ్ఞం' వచ్చే శ్రీరామనవమి వరకు అంటే, 1998 ఏప్రిల్ 20వ తేదీ వరకు కొనసాగుతుంది. ఈ సమయంలో నిరంతరాయంగా సీతారామ నామ పారాయణం చేయడానికి దాదాపు 21,000 మంది పండితులను నియోగించారు.

## ఫ్రెంచి అనువాదం

శిక్కుల పవిత్రగంథం 'గ్రంథ సాహెబ్' ఇటీవల ఫ్రెంచి భాషలోకి అనువదించడింది. 16 పేజీల అనుబంధంతో 1,676 పేజీల మహాగ్రంథం ఇది. కెనాడాలో ప్రభుత్వోద్యోగం చేసి ఇటీవల పదవీ విరమణ చేసిన డా॥జర్నాయిల్ సింగ్ ఈ అనువాదం చేశాడు. దీనికి ఆయనకు 12 సంవత్సరాలు పట్టింది. విదేశాలకు వెళ్ళి స్థిరపడిన శిక్కులలో అధిక సంఖ్యాకులు కెనాడాలోనే ఉన్నారు. అక్కడ ఇంగ్లీషు, ఫ్రెంచ్ అధికార భాషలుగా ఉంటున్నాయి. కెనాడా, ఫ్రాన్స్ కాకుండా ప్రపంచం మొత్తం మీద 40 దేశాలలో ఫ్రెంచి భాష మాట్లాడే వాళ్ళున్నారు. మన దేశంలో పాండిచ్చేరి, కారైక్కాల్, మాహే, యానాం ప్రాంతాల్లో ఇప్పటికీ ఫ్రెంచి భాష మాట్లాడే వాళ్ళున్నారు!

## శిశువులు ఎందుకు ఏడుస్తారు?

పాలుకావాలన్నా, తల్లి కావాలన్నా, భద్రంగా నిద్రపోవాలన్నా పసిపిల్లలు ఏడుస్తారు. ఇది తల్లులందరకీ తెలిసిన విషయమే. అయినప్పటికీ ఈ విషయం గురించి అమెరికాలోని – స్పీచ్ రికగ్నిషన్ అండ్ లాంగ్వేజ్ అండర్‌స్టాండింగ్ సర్వీసస్ లాబొరేటరీ; కెనాడాలోని యూనివర్సిటీ ఆఫ్ బ్రిటిష్ కొలంబియా శాస్త్రజ్ఞులు కొన్ని పరిశోధనలు జరుపుతున్నారు. పిల్లల రకరకాల ఏడ్పులను పరిశీలించి టేప్ చేస్తున్నారు. వాటిని గురించి విశ్లేషణ జరుపుతున్నారు. శిశువుల ఏడ్పును బట్టి వాళ్ళ అవసరాలేమిటో తెలుసుకోవచ్చునని వాళ్ళు చెబుతున్నారు!

చందమామ
అనుబంధం
104



మనదేశపు
అందచందాలు

# కోణార్క సూర్యదేవాలయం

ఒరిస్సా రాష్ట్రంలోని సుప్రసిద్ధ కోణార్క దేవాలయం 13వ శతాబ్దంలో నిర్మించబడింది. ఇదొక సూర్యదేవాలయం. మనదేశంలోని చాలా ఎత్తయిన దేవాలయాలలో కోణార్క (దాదాపు 200 అడుగులు) ఒకటి. ప్రవేశద్వారంలో వరుసగా ఉన్న మెట్లకు ఇరువైపులా అశ్వశిల్పాలు అమర్చబడి ఉన్నాయి మొత్తం ఆలయం రథాకృతిలో కనిపిస్తుంది. సూర్యభగవానుడు ఏడు గుర్రాలు పూన్చిన రథంలో ఆకాశ మార్గంలో పయనిస్తాడని మన పురాణాలు పేర్కొంటాయి.







గంగ వంశానికి చెందిన నరసింగ దేవ రాజు ఆధ్వర్యంలో, ఈ ఆలయ నిర్మాణం జరిగింది. 1,200 మంది శిల్పులు 16 సంవత్సరాలు నిర్విరామంగా శ్రమించి ఈ ఆలయాన్ని నిర్మించినట్టు చెబుతారు. దీనికి 40కోట్ల రూపాయలు వ్యయం అయింది.

కోణార్క ఆలయంలోని శిల్పాలు ఈ నాటికీ చూపరుల హృదయాలను అలరింపజేస్తాయి. హృద్యమైన ఒడిస్సీ నాట్య భంగిమలలో, నాట్యకళాకారుల కదలికలలో సూర్య దేవాలయంలోని రకరకాల శిలా భంగిమలు రసజ్ఞులయిన ప్రేక్షకుల కళ్ళ ముందు కదలాడుతాయి.

పురాణకాలంనాటి రాజులు :

# జానశ్రుతి – రైక్వుడు

జనశ్రుతి కుమారుడైన జానశ్రుతి ధర్మ పరిపాలనాదక్షుడు. రోజు తప్పకుండా ప్రజల బాగోగులను అధికారుల ద్వారా, వేగులద్వారా తెలుసుకుని, వాళ్ళకేవైనా కొరతలు, సమస్యలు ఉన్నట్టయితే, వాటిని తీర్చి, అందరూ సుఖంగా ఉన్నారని రూఢి చేసుకున్న తరవాతే నిద్రకు ఉపక్రమించే ఆదర్శ ప్రభువు ఆయన!

ఒకనాటి పున్నమిరేయి, జానశ్రుతి రాజప్రసాదం ఉపరితలంలో పచార్లు చేస్తూండగా, ఆకాశంలో కొన్ని రాజహంసలు ఎగురుతూ కనిపించాయి. రాజభవనం మీదుగా వెళుతూ అవి ఏవో మాట్లాడుకోవడం రాజుకు వినిపించింది. ఆయనకు పక్షులభాష తెలుసు.

"ఈ రాజభవనంపై నుంచి ఏదో వింత కాంతి కనిపిస్తున్నది!" అన్నది ఒక రాజహంస.

"అవును, నీకు కనిపించే కాంతి జానశ్రుతి ప్రభువు తేజస్సు. ఆయన సత్యసంధుడు; ధర్మ పరిపాలకుడు కాబట్టి ఆయన చుట్టూ ఆ తేజో వలయం ఏర్పడింది. అయితే అది ఆయనకే కనిపించదు!" అన్నది రెండవ హంస.

"జానశ్రుతి ధర్మ ప్రభువే! అందులో సందేహం లేదు. అయినా, ఇంతకు ముందొక రాత్రి రైక్వ రాజు భవనం మీద ఎగురుతూ ఇంతకన్నా ప్రకాశవంతమైన కాంతిని చూశాను," అన్నది మూడో హంస.

ఆ తరవాత హంసలు మేఘాల చాటుకు వెళ్ళి పోయాయి. రాజు, హంసల మాటలు విని ఎంతో సంతోషించాడు. తనకన్నా ఆదర్శవంతమైన పాలన జరిపే రాజు భూమిమీద మరొక డున్నాడని తెలిసి పరమానందం చెందాడు. ఆ రాత్రి హాయిగా, ప్రశాంతంగా నిద్రపోయాడు. మరునాడు తెల్లవారగానే, మంత్రులనూ దూతలనూ పిలిపించి, రైక్వ రాజును గురించి మరింత సమాచారం సేకరించాడు. ఆ తరవాత తానే స్వయంగా బయలుదేరి వెళ్ళి, రైక్వుణ్ణి కలుసుకున్నాడు. ఆయనతో సంభాషణ జరిపాడు. యువకుడైన రైక్వుడి ధర్మనిరతికి సంతోషించి, ఆయనకు తన కుమార్తెనిచ్చి వివాహం జరిపి, తన రాజ్యాన్ని కూడా ఆయన పరం చేశాడు.

జానశ్రుతి మహారాజు, అధికారం ఉండీ గర్వించని వినయ సంపన్నుడు. తనకన్నాగొప్ప వారిని చూసి, అసూయ చెందడానికి బదులు పరమానందంచెందే ఉత్తములకోవకు చెందిన మహా పురుషుడాయన!



## మీకు తెలుసా?

# అద్భుతమైన వినోద కార్యక్రమం





'ఓపెరా' ఒక సంగీత నాటక ప్రక్రియ. ఈసంగీత నాటకాలలో గాయకులే నటిస్తారు. వాళ్ళ వెనక సంగీత వాద్యకారుల బృందం ఉంటుంది. బ్రహ్మాండమైన అలంకార తెరలు, వేషాల కోసం ధరించే రంగురంగుల దుస్తులు ఆడంబరంగా ఉంటాయి. ఈ సంగీత నాటక ప్రక్రియ 16వ శతాబ్దాంతంలో ఆరంభమయింది. గ్రీకు, రోమను పురాణాల నుంచి కథాంశాలను తీసుకునే వారు. చాలాకాలం వరకు ఓపెరా, సంపన్నుల వినోద కార్యక్రమంగానే కొనసాగింది.18వ శతాబ్ద మధ్య కాలంలో యూరపు మొత్తంమీద నగరాలలోనూ, పట్టణాలలోనూ ఈ సంగీత నాటక ప్రదర్శన శాలలు నిర్మితమయ్యాయి. గేయనాటకాలతో పాటు ఈ వేదికల మీద అద్భుతమైన సంప్రదాయ సంగీత కార్యక్రమాలను కూడా ఏర్పాటుచేస్తారు.

## ఇంద్రధనుస్సు

# తామరపుష్ప ఆలయం





తామర పుష్పానికి ఆలయమా అని ఆశ్చర్య పోతున్నారా? ఇవాళ మన రాజధాని ఢిల్లీ నగరంలో ఈ తామర పుష్ప ఆలయం ఒక ముఖ్యమైన ఆకర్షణగా ఉంటున్నది. 8,000 మంది కార్మికులు ఆరున్నర సంవత్సరాలు ఈ ఆలయ నిర్మాణానికి రాత్రింబవళ్ళు శ్రమించారు. దీనికి 120 లక్షల అమెరికన్ డాలర్లు వ్యయమయింది. ఈ తామరపుష్ప ఆలయాన్ని 'బహాయీ' మందిరం అని కూడా అంటారు. ఈ ఆలయం వెలుపల మూడు జతల పుష్ప దళాలు ఉన్నాయి. వీటి లోపల తొమ్మిది పుష్పదళాలు ఉన్నాయి. ఆలయం మెరిసే తెలుపు రంగుతో ఉంటున్నది. ఈ ఆలయానికి అవసరమైన సిమెంటును ప్రత్యేకంగా కొరియా నుంచి తెప్పించారు.




# అదృష్ట దురదృష్టాలు

*(గత సంచిక తరువాయి)*

రాజు నిర్ణయించిన రోజున, ఒక చిన్న నౌకలో సరంగు, నలుగురుభటులుమాత్రం పేదవాణ్ణి తీసుకుని ప్రయాణమయ్యారు.

బయలుదేరే ముందు రాజు, పేదవాడితో, "సరిగ్గా ఆరునెలల తర్వాత ఇదే రోజున, ఇదే నౌకను, ఈ భటులను మళ్ళీ పంపిస్తాను. అప్పటివరకూ నువ్వు బతికే వున్న పక్షంలో, సరిగ్గా ఆనాటికి తీరానికి వచ్చి నిలబడు. వీళ్ళు ఖచ్చితంగా మూడు గంటలపాటు మాత్రమే అక్కడ నీ కోసం చూస్తారు," అని చెప్పాడు.

పేదవాడు అంగీకారంగా తలవూపి, మనసులోనే దైవధ్యానం చేసుకుంటూ నౌక ఎక్కి కూర్చున్నాడు.

సరంగు నౌకను వేగంగానడిపి, చేరవలసిన దానికి చాలా ముందుగానే రాకాసిదీవి చేర్చాడు. వెంటనే భటులు తాళ్ళ నిచ్చెనను కిందికి దింపి, పేదవాణ్ణి త్వరగా దిగిపోవలసిందిగా ఖంగారుపెట్టారు. పేదవాడు రాకాసిదీవి మీద కాలుమోపటం తడవుగా ఆహారపదార్థాలున్నమూటలను, ఇతర సామగ్రిని భూమి మీదికి విసిరేసినట్టుగా పడవేశారు. ఆ పని పూర్తయిన మరుక్షణం నౌక తిరిగి ప్రవాహంలోకి చొచ్చుకుపోవటం ప్రారంభించి చూస్తూండగానే నిమిషాల్లో కనుమరుగైంది. చుట్టూరా అనంతమైన సముద్రం, మధ్యలో భూమి, ఆ భూమి మీద పేదవాడు ఒంటరిగా మిగిలాడు.

ఒక్కసారిగా దారుణమైన ఒంటరితనం చుట్టుముట్టగానే, పేదవాడికి భరించలేని దుఃఖంవచ్చింది. వాడు వున్నచోటనే నేల మీద చతికిలబడి వెక్కివెక్కి ఏడుస్తూ, "భగవంతుడా, నాకుఎలాంటి దిక్కుమాలినబతుకు రాసిపెట్టావయ్యా? ఈ ఒంటరి

లక్ష్మీగాయత్రి

తనాన్నీ, బెంగనూ భరిస్తూ బతికే కంటే చావటమే మంచిది. నన్ను తొందరగా చంపెయ్యి! ఆ రాక్షసుడి సడి వినగానే, నా గుండె ఆగిపోయేలా చేసి, కనీసం సుఖమైన చావునైనా ప్రసాదించు!" అనుకున్నాడు.

భయంతో, బెంగతో వాడికి ఆకలిచచ్చిపోయింది. ఎటూ చచ్చేవాడికి తిండికూడా ఎందుకు, దండగ! అనుకునివాడు ఆహార పదార్థాలకేసి కన్నెత్తి అయినాచూడక,ఓపిక వున్నంత వరకూ ఏడ్చి, ఆఖరికి అక్కడే సొమ్మసిల్లినట్టు పడుకుని నిద్రపోయాడు.

మళ్ళీ మెలుకువ వచ్చేసరికి, సూర్య కిరణాలు వాడి మీద పడుతున్నాయి. ఆ లేత వెలుతురులో తనను తాను చూసుకునేసరికి, తను ఇంకా బతికే వున్నందుకు ఎక్కడలేని ఆనందమూ కలిగింది. రాక్షసులు, మనుషుల వాసన పసిగట్టి వస్తారంటారు గదా - తను వచ్చి ఇంతసేపైనా రాక్షసుడింకా రాలేదేమా, అన్న ఆశ్చర్యం కూడా కలిగింది వాడికి.

ఎందుకైనా మంచిదని పేదవాడు, ఆ రోజంతా తనున్న చోటునుంచి కదలక, ఆకలి వేసినప్పుడల్లా బుట్టలోని పళ్ళూ, మిఠాయిలూ తిని, రాత్రికి అక్కడే పడుకుని నిద్రపోయాడు.

మూడోనాటి ఉదయానికి కూడా,తను సజీవంగానే వుండేసరికి పేదవాడిలో ఉత్సాహమూ, ధైర్యమూ పుట్టుకొచ్చాయి. వాడు మొండిధైర్యంతో నెమ్మదిగా దీవి లోపలికి నడకసాగించాడు. సాయంత్రందాకాతోచిన దారి వెంట నడుస్తూ తిరిగినా, వాడికి



రాక్షసుడి జాడ కానరాలేదు. చీకటిపడే వేళకు ఫలవృక్షాలు దట్టంగా వున్న ఒక ప్రదేశాన్ని చేరుకుని, భయంభయంగానే అక్కడ పడుకుని నిద్రపోయాడు.

నాలుగోనాటి ఉదయంలేచి, తిరిగి నడక సాగించిన పేదవాడు, మధ్యాహ్నమయ్యేసరికి దాదాపుగా దీవి మధ్యభాగాన్ని చేరుకుని, అక్కడ కనిపించిన దృశ్యం చూసి స్తంభించిపోయాడు.

విశాలంగా వున్న ఒక సమతల ప్రదేశంలో, అతిపొడవైన అస్థిపంజరం ఒకటి పడివున్నది. దాని ఆకార విశేషాలు గమనించిన పేదవాడు, అది రాకాసిదీవికి చెందిన వింతరాక్షసుడిదేనని నిశ్చయించుకుని, ఆనందబాష్పాలు రాలుస్తూ, చేతులెత్తి భగవంతుడికి అంజలి ఘటించాడు.



వింతరాక్షసుడు మరణించాడనీ, ఇక ఆ దీవిలో ప్రమాదం ఏదీ లేదనీ అనుకునే సరికి, పేదవాడికి ఎక్కడలేని ధైర్యమూ వచ్చింది. వాడు ఉత్సాహంగా కనిపించిన ఫలవృక్షాల పళ్ళు కోసుకుని తింటూ ముందుకు సాగాడు.

ఐదోనాటి మధ్యాహ్నానికి పేదవాడికి మరొక వింత కనిపించింది. ఒకానొక మహావృక్షం కింద, నేలమీద, లెక్కకు మించిన వజ్రవైడూర్యాలూ, మేలుజాతి రత్నాలూ, ముత్యాలూ అనేకమైన బంగారు నగలూ కుప్ప పోసివున్నాయి.

అంతపెద్దనిధిని చూడగానే పేదవాడికి విపరీతమైన ఆశ్చర్యం కలిగింది. "ఇవన్నీ గతంలో రాక్షసుడి బారిన పడ్డ వర్తకులవీ, నావికులవీ అయివుంటాయి!" అనుకుని వాడూ,రాక్షసుడి చేతచిక్కి మరణించిన వారిని తలచుకుని జాలిపడ్డాడు. ఆతర్వాత చాలాసేపు ఆలోచిస్తూ వుండిపోయిన పేదవాడు, మళ్ళీ తీరానికివెళ్ళి, తన ఆహార పదార్థాల సంచుల్లో పెద్దవి రెంటిని ఖాళీ చేసి, వాటినిండా పట్టినంత బంగారాన్నీ, రత్నాలనూ నింపాడు. ఆ పనులు చేస్తూండగా అక్కడ వున్న పొదల ముళ్ళు గీరుకుని రెండు చేతులకూ గాయాలయ్యాయి. అయినా, వాటిని లెక్కచేయక పని పూర్తి చేసుకుని తిరిగి తీరానికిపోబోతూండగా, నిధికికాస్త ఎడంగావున్న, ఒక చిన్న తోలు సంచి వాడి దృష్టిని ఆకర్షించింది.

వెంటనే నిధివున్న సంచులను కింద పెట్టి, తోలుసంచిలో ఏమున్నదా అని చూసిన పేదవాడికి, అందులో కాంతులు విరజిమ్ముతున్న, ఒక చిన్న మణి కనిపించింది. వాడు ఆ మణిని తీసుకుని,అటూ ఇటూ తిప్పి పరీక్షగా చూడసాగాడు.అంతే, తక్షణం ఆ మణి స్పర్శ తగిలినంతమేరా, వాడిచేతులకు అయిన గాయాలు మటుమాయమయినై. అక్కడి చర్మం ఎప్పటిలా కాంతివంతంగా తయారైంది. వాడు ఆ వింతకు ఆశ్చర్యపోతూ, మణిని మిగిలిన గాయాలకు కూడా అంటించి చూశాడు. అవీ కనపడకుండా పోయాయి.

పేదవాడు అమితానందంతో, భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పుకుని, ఆ మణిని తిరిగి తోలుసంచీలో పెట్టి భద్రపరచి, తీరానికి తిరిగి వచ్చాడు.

ఇది జరిగిన నాలుగురోజులకు, తీరం నుంచి కాస్త ఎడంగా పోతూ, ఒక పెద్ద

వర్తకనౌక పేదవాడికంటబడింది. వెంటనే వాడు తీరం వెంట పరుగులుతీస్తూ బిగ్గరగా కేకలు పెట్టీ, తన పైబట్టను గాలిలో ఊపీ, చివరకు నౌకలోవున్న వాళ్ళ దృష్టిని ఆకర్షించ గలిగాడు. ఆ తర్వాత కొద్దిసేపటికే ఆ నౌక సరంగు, నౌకను తీరానికి నడిపి, పేదవాణ్ణి అతడి సామానుతోసహా నౌకలోకి ఎక్కించుకున్నాడు. నౌక తిరిగి బయల్దేరింది.



నౌకలోని చాలామంది పేదవాడి చుట్టూ చేరి, "అయ్యా, మీరెవరు? మానవమాత్రుడెవడూ కాలు మోపటానికి కూడా ఇష్టపడని, ఈ రాకాసిదీవి మీద మీరు ఒంటరిగా ఇలా సామానుతో సహా చిక్కుబడటం ఎలాజరిగింది?" అంటూ ప్రశ్నలు గుప్పించారు.

పేదవాడు ఒకసారి గట్టిగా ఊపిరితీసుకుని, ముందే ఆలోచించుకున్న ప్రకారం, ఇలా చెప్పటం ప్రారంభించాడు:

"అయ్యలారా, నా పేరు శివదాసు. మాది కుంభీనసదేశం. నేనొక చిన్న వర్తకుణ్ణి. నాకు చాలాకాలం నుంచి సముద్ర వ్యాపారం చెయ్యాలనీ, లక్షలు గడించాలనీ కోరికగా వుండేది. అయితే, సముద్ర వ్యాపారం చాలా ప్రమాదాలతో కూడినదనీ, ఒక్కొక్కసారి లాభం అన్నది లేకపోగా పెట్టుబడి మొత్తం పోగొట్టుకోవటం కూడా జరుగుతుందనీ నా స్నేహితులు నన్ను వెనక్కులాగుతూ వచ్చారు. అయినా నా కోరిక చావలేదు. ఒకరోజు నేను బాగా ధనవంతుడైన, నా బాల్యమిత్రుడొకడితో, "ఎవరెన్నిచెప్పినా, నాకు సముద్ర వ్యాపారం చెయ్యాలనే కోరిక వదలటం లేదు. తగినంత పెట్టుబడి నా దగ్గరలేకా, అప్పుచేస్తే తిరిగి తీర్చగలనోలేదో అన్న భయంచేతా వెనకడుగు వేస్తున్నాను. నాకే గనక ఎవరైనా కోరినంత ధనం ఇస్తానంటే, రాకాసిదీవిలో ఒకవారం పాటు గడపటానికైనా సిద్ధం!" అన్నాను.

"ఆ మిత్రుడికి ఇలాంటి పందేలంటే మహా ఇష్టం. ఆ సంగతి ఎరిగే నేనలా మాట్లాడాను! వెంటనే అతడు నాతో ఒప్పందం కుదుర్చుకుని, నేను కోరినంత ధనాన్నీ, ఆహారాది ఇతరసామగ్రినీ ఇచ్చి, దీవిలో దిగవిడిచాడు. మా ఒప్పందం ప్రకారం రాకాసిదీవి నుంచి బైట పడే బాధ్యత నాదే! నేనాదీవికి వచ్చి, ఈనాటితో పదిరోజులైంది. ఈ పదిరోజుల నుంచీ



దాంతో నౌకలోని వాళ్ళందరూ చాలా సేపు రాకాసిదీవి గురించీ, రాక్షసుడున్నాడా లేక సహజ మరణం చెందాడా అన్న విషయం గురించీ చర్చలు సాగించారు.

పేదవాడు నెమ్మదిగా మాటమార్చి, ఆ నౌకతాలూకూ ప్రయాణపువివరాలూ, నౌక లోని వర్తకుల వివరాలూ తెలుసుకున్నాడు.

ఆ నౌక, పేదవాడి స్వదేశమైన కుంభీనసకు పొరుగునవున్న, మాతంగ దేశానికి చెందిన వ్యాపారనౌక. చిన్నా పెద్దా వర్తకులున్న ఆనౌక, మార్గమధ్యంలోగల నాలుగైదు దీవులవద్ద మజిలీలు చేస్తూ, సింహళ దేశంవరకూ వెళుతుంది. నౌకలో వున్న వర్తకులందరిలోకీ పెద్దవాడుగా, సౌమ్య స్వభావిగా కనిపిస్తున్న మణికుండలుడనే వర్తకుడు, పేదవాడి మనసును ఆకట్టుకున్నాడు. దాంతో ఆ క్షణం నుంచీ వాడు, మణికుండలుడి వెన్నంటే వుంటూ, అతడి నుంచి అమూల్యమైన వ్యాపార రహస్యాలు తెలుసుకోవటం ప్రారంభించాడు.

ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని ఎక్కడ దిగానో అక్కడే కూర్చుని, ఏదైనా నౌక ఇటువస్తే బాగుండునని, ఆ దేవదేవుణ్ణి ప్రార్థిస్తూ గడిపాను. ఈనాటికి నా అదృష్టం పండింది!" అంటూ ముగించాడు.

చుట్టూ చేరినవాళ్ళు, పేదవాడుచెప్పింది అబ్బురపడుతూ విని, "పదిరోజులపాటు రాకాసిదీవిలోవుండికూడా ప్రాణాలతో బైట పడటం, ఒక పట్టాన నమ్మలేని విషయం! అసలు దీవిలో రాక్షసుడున్నాడా?" అంటూ ప్రశ్నించారు.

"ఏమో నాకేం తెలుసు! నేను తీరం నుంచి లోపలికి పదడుగుల మేర కూడా వెళ్ళలేదు. లోపలినుంచి నాకెలాంటి అలికిడీ వినిపించ లేదు," అని జవాబిచ్చాడు శివదాసుగా మారిన పేదవాడు.

అలా రోజులు గడిచి, నౌక, నారికేళ ద్వీపమనే చిన్న దీవికి చేరింది.

"శివదాసూ, ఇక్కడ కొబ్బరికాయలూ, ఎండుకొబ్బరీ, కొబ్బరిపీచుతో తయారు చేసిన అలంకారవస్తువులూ కారుచౌకగా దొరుకుతాయి. వాటికి ముందు ముందు మనం వెళ్ళబోయే ద్వీపాల్లోనూ, సింహళ దేశంలోనూ కూడా మంచి గిరాకీ వున్నది," అన్నాడు కుండలుడు, పేదవాడితో.

వెంటనే పేదవాడు ఆయన వెంట దీవిలోకి వెళ్ళి, తనుకూడా కుండలుడితో బాటు అన్నీ కొని, నౌకలో భద్రపరిచాడు.

ఆ తర్వాత విహారార్థం దీవిలో తిరుగుతుండగా, మణికుండలుడు ఒక రాయి కాలికి తగిలి, బోర్లాపడిపోయాడు. గాయం వల్ల కలుగుతున్న బాధతో అతడికి ఆరాత్రి నిద్ర కూడా పట్టలేదు. పక్క మీద అటూ ఇటూ పొర్లుతున్న అతడు, ఎవరో తన సమీపానికి వచ్చి కూర్చోవటంతో చప్పున లేచి, దీపపు వత్తిని పెద్దది చేసి చూస్తూ, "శివదాసూ, ఇంత రాత్రి వేళ ఇలా వచ్చావేం?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

పేదవాడు నెమ్మదిగా, "మీ బాధచూసి ఆగలేకఇలావచ్చాను.ఒక్కక్షణంవుండండి!" అని, మణికుండలుడి తలకు వున్న కట్టు విప్పేసి, తన దుస్తుల్లో భద్రపరిచి తెచ్చిన మణిని గాయానికి తాకించాడు.

మరుక్షణం మణికుండలుడి బాధంతా మాయమైంది. అతడు ఆశ్చర్యంగా, "శివదాసూ! ఏమిటిదంతా? నువ్వు నిజంగా వర్తకుడివేనా?" అని ప్రశ్నించాడు.

పేదవాడు వెంటనే జవాబు చెప్పలేనన్నట్టు కాసేపు మౌనంగావూరుకుని, "ఈ ప్రశ్న ఎదురవుతుందనే, ఈ పని ఇప్పటిదాకా చెయ్యలేకపోయాను. మీబాధచూడలేక చివరకు తెగించాను," అంటూమణికుండలుడి చేతులుపట్టుకుని, "అయ్యా, మీరు వయసులోనూ, అనుభవంలోనూ, మంచితనంలోనూ కూడా, నాకంటే పెద్దవారు. నేను ప్రస్తుతం వర్తకుణ్ణన్నమాట ముమ్మాటికీనిజం. నాగత జీవితంగురించి మాత్రం నన్నేమీప్రశ్నించకండి. నా ఇప్పటి స్థితికి కారణభూతుడైన వ్యక్తికి ముందుగా చెప్పిన తర్వాతనే, నా గురించి మిగిలిన వారందరికీ చెప్పాలన్నది, నా ఆకాంక్ష. ఒక్కవిషయంమాత్రం చెబుతాను వినండి. గతంలోనూ, ప్రస్తుతంలోనూ, ఇక ముందరి జీవితంలోనూ ఎప్పుడూ కూడా నేను, ఆ భగవంతుణ్ణే నమ్ముకున్న మనిషిని. మనిషి నుదుట ఆ భగవంతుడు ఎలా రాసిపెట్టి వుంటే అలాజరుగుతుందని గాఢంగానమ్మే వాణ్ణి. నా నమ్మకమే నా ఈ స్థితికికారణం. నా వ్యాపార జీవితంలో ప్రథమ గురువులు మీరు. నన్ను నమ్మి, ఆశీర్వదించండి!" అంటూ చేతులెత్తి నమస్కరించాడు.

మణికుండలుడు ఆశ్చర్యంగా అంతా విని, పేదవాడి తలమీద అప్రయత్నంగా చెయ్యివేసి ఆశీర్వదించాడు.

*– (ముగింపు వచ్చే సంచికలో)*






# డబ్బుకొద్దీ చికిత్స

ఒక గ్రామంలో బంగారయ్య అనే ధనికు డుండేవాడు. ఆ చుట్టుపక్కల అతనితో సమానమైన ఆస్తిపరుడు లేడు. అయితే అతను ఎవరికీ సాయపడే వాడుకాడు. గొప్ప పిసినారి. కాకికి ఎంగిలి చెయ్యి దులిపేవాడు కాడు.

పిసినారి బంగారయ్యకు ఒకసారి కంటి జబ్బు వచ్చింది. కళ్ళవెంబడి అదే పనిగా నీరు కారటమూ, విపరీతమైన మంటా, తల నొప్పి, కాళ్ళు వణకటమూ వీటితో బాటు దృష్టి మందగించటమూ పట్టుకు న్నాయి.

పొరుగు గ్రామంలో ఒక గొప్ప వైద్యు డుండేవాడు. ఆయన ఇచ్చే మందులు రామబాణాలవంటివి. వాటికి తిరుగులేదు. వైద్యంలో ఆయనకు ఎంత పేరంటే ఆ ప్రాంతాలలో ఉండే గ్రామాలలో మరొక వైద్యుడెవడూ బతకలేక పోయాడు.

ఈ వైద్యుడిలో ఒక గుణం ఉన్నది. ఆయన రోగి యొక్క స్థితిగతులు చూసి మరీ మందిచ్చేవాడు, డబ్బు కూడా ఆ విధంగానే రాబట్టేవాడు. బీదా బిక్కీ అయితే వాళ్ళకు తగ్గ మందే ఇచ్చి, వాళ్ళు ఎంత ఇస్తే అంతే పుచ్చుకునే వాడు. ధనికులకయితే వాళ్ళకు తగ్గ మందులిచ్చి డబ్బు బాగా రాబట్టే వాడు.

పిసినారి బంగారయ్యకు ఆ వైద్యు డంటే ఇందుకే తీరని కోపం. ఒకప్పుడా యన జబ్బు చేసి ఆ వైద్యుడి చేత ఏదో చికిత్స చేయించుకుని మరొక మార్గం లేక నూరు రూపాయలు ఇచ్చుకోవలసి వచ్చింది.

ఇప్పుడు బంగారయ్యను పట్టుకున్న రోగానికి చికిత్స చెయ్యాలంటే ఆ వైద్యుడే చెయ్యాలి. ఎందుకంటే ఆ చుట్టుపక్కల అనేక కోసుల దూరంలో మరొక వైద్యుడే

లేదు. అయితే ఈయన చేత చికిత్స చేయించుకుంటే డబ్బు బాగా వదులుతుంది.

అందుకని బంగారయ్య ఒక పేదవాడిలాగా నటిస్తూ వెళ్ళి, వైద్యుడి దగ్గిర చికిత్స పొందాలని ఆలోచించాడు. ఆయన ఒక చింపిపాత కట్టుకుని తలకు మరొక చింపిపాత చుట్టుకుని, తాంబూలంలో రెండణాలు పెట్టుకుని, వైద్యుడి ఇంటికి కుంటుకుంటూ వెళ్ళి, తన అవతారానికి తగ్గట్టు యాసగా మాట్లాడుతూ, తనకంటి జబ్బు గురించి ఆయనకు వివరంగా చెప్పుకుని, చికిత్స చెయ్యమని దీనంగా వేడుకున్నాడు.

"నీ జబ్బు నేను నయం చేస్తాను. భయపడకు. నేను చెప్పినట్టు చెయ్యి. నాలుగు ముల్లంగిదుంపలు తెచ్చి, వాటిని చక్రాలుగా తరిగి, ఉప్పు అద్దు. నీరు బయటికి వస్తుంది. ఆ నీటిలో ఇంగువ చేర్చి తాగు. తరవాత ఆ ముల్లంగి చక్రాలను ఎండబెట్టి రాత్రి పూట తిను. ఇలా రోజు తప్పకుండా ఒక మండలం రోజులు తిన్నావంటే తప్పకుండా నీ కంటి రోగం పూర్తిగా నయమవుతుంది," అన్నాడు వైద్యుడు.

బంగారయ్య ఇంటికి తిరిగి వచ్చి, వైద్యుడు చెప్పినట్టే నలభై రోజులూ చేశాడు. కాని చికిత్స చాలా అసహ్యమనిపించింది. ఇంగువా, ముల్లంగి వాసన కొట్టే ఉప్పు నీళ్ళు తాగటమూ, ఎండబెట్టిన ముల్లంగి ముక్కలు తినటమూ, అంటే చక్కని భోజనం తినేవాడికి రోతగానే ఉంటుంది మరి. నలభై రోజుల పాటు పళ్ళ బిగువున ఈ చికిత్స చేసుకున్నందుకు జబ్బేమో నయమయింది,కాని బంగారయ్య జిహ్వకు చవి చచ్చింది.





అందుచేత బంగారయ్య చికిత్స పూర్తి కాగానే నోటికి సుఖంగా లడ్డూలు చేయించుకుని, ఆత్రంకొద్దీ మితిమీరి తిన్నాడు. దాంతో బంగారయ్యకు అజీర్తి, అమిత దాహమూ, అగ్నిమాంద్యమూ, కడుపు నొప్పీ పట్టుకున్నాయి. మళ్ళీ వైద్యుడితో పనిపడింది.

బంగారయ్య మళ్ళీ పాతవేషమే వేసుకుని, తాంబూలంలో రెండణాలు ఉంచుకుని, వైద్యుడుదగ్గిరికి వెళ్ళాడు; వెళ్ళి,తన పాతరోగం నయమయిందనీ, కొత్త రోగం పట్టుకున్నదనీ, దానికి కూడా చికిత్స చేసి పుణ్యం కట్టుకోమని వైద్యుణ్ణి దీనంగా వేడుకున్నాడు.

వైద్యుడు బంగారయ్య నాడి పరీక్షించి, "ఏం తిని ఇంత అజీర్తి తెచ్చుకున్నావు? నువ్వుతిన్నదాన్నిబట్టి మందు ఇవ్వవలసి ఉంటుంది," అన్నాడు.

"లడ్డూలు తిన్నానండీ," అన్నాడు బంగారయ్య.

"ఇంత అజీర్తి చెయ్యాలంటే చాలా లడ్డూలు తిని ఉండాలే! నీ కెక్కడివిరా అన్ని లడ్డూలూ?" అని వైద్యుడు గట్టిగా అడిగాడు.

బంగారయ్య మాట మార్చటానికి, "అయ్యో, కడుపునొప్పి మెలిపెట్టేస్తున్నది. భరించలేకుండా ఉన్నాను బాబూ! ముందు మందివ్వండి. అదంతా తరవాత చెబుతాను," అన్నాడు.

"నీ చేత ఇన్ని లడ్డూలు తినిపించిన వాడు తప్పక సంపన్నుడే అయి ఉండాలి. ఆ సంపన్నుడెవరో తెలిస్తే గాని మందు ఇవ్వను. అది నా పద్ధతి. రోగం తెప్పించినవాడు మందు ఖర్చు మాత్రం ఇచ్చుకోలేడా ఏం?" అన్నాడు వైద్యుడు కాస్త కోపంగా.

"బంగారయ్యగారేనండి. ఆయన కింద పని చేసేవాణ్ణి. శానా రోజులయింది, చూసి పోదామని నిన్న వెళ్ళాను. లడ్డూలిచ్చారు. నోటి ఆత్రం కొద్దీ తినేశాను," అన్నాడు బంగారయ్య.

"ఇంకేం? మందుకు యాభైరూపాయలవుతుందని చెప్పి పట్టుకురా. ఈ లోపల నీ రోగానికి మందు సిద్ధం చేసి ఉంచుతాను," అన్నాడు వైద్యుడు.

"అది తప్పు కాదండీ? వారు పెట్టిన లడ్డూలు తిని రోగం తెచ్చుకున్నది చాలక, దానికి మందు ఖర్చు కూడా వారినే

ఇయ్యమని ఎట్లా అడుగుతానండి? అది నా వల్ల కాదండి," అన్నాడు బంగారయ్య మొండిగా.

"నీ వల్ల కాకపోతే నేనే అడిగి తీసు కుంటాలే. నాకీ పూట బంగారయ్యగారి ఊరు పోవలిసిన పని కూడా ఉన్నది," అంటూ వైద్యుడు ఏదో చూర్ణాన్ని బంగా రయ్య నోట వేసి, ఇన్ని నీళ్ళు తాగించి, అజీర్తి రోగం బాగైపోతుంది పొమ్మని చెప్పాడు.

బంగారయ్య నోరంతా ఒక్కసారి భగ్గున మండింది. నాలుక విలవిలలాడింది. కళ్ళు తిరిగినట్టయింది. చెవులు గడియలు పడ్డాయి. అడ్డదారిన గబగబా ఇంట్లో వెళ్ళిపడి, తియ్యగా ఏదన్నా నాలుకకు రాచుకుందామనుకున్న బంగారయ్య, కొంతదూరం వెళ్ళి, ఆ పైన నడవలేక, ఒక చెట్టు కింద చతికిలబడి, నోరు తెరిచి రొజసాగాడు. ఈ లోపలనే వైద్యుడు చుట్టుదారిన బంగారయ్య ఇల్లు చేరి, బంగారయ్య ఎటో వెళ్ళాడనీ, త్వరలోనే రావచ్చుననీ తెలుసుకుని, బంగారయ్య కోసం ఎదురుచూస్తూ వేచి ఉన్నాడు.

కొంతసేపటికి బంగారయ్య ఆపసోపాలు పడుతూ ఇల్లుచేరి, అక్కడ తలవని తలంపుగా వైద్యుణ్ణి చూసి కంగారు పడుతూ, "మీరా? ఇక్కడా?" అంటూ గోడపక్కనున్న కుర్చీలో బాధతో కూలబడ్డాడు.

వైద్యుడాయనను చూసి, "నేను అను మానిస్తూనే ఉన్నాను. ఎందుకంటే, మీకు వచ్చిన జబ్బు కాయకష్టం చేసే వాళ్ళకూ, బీదవాళ్ళకూ వచ్చే జబ్బు కాదు. మీరు కంటి జబ్బుతో వచ్చి మందడిగినప్పుడు, నిజంగా బీదవాడే అనుకుని మోట వైద్యం చెప్పాను. మీలాటి వాళ్లకు అలాటి వైద్యం పట్టదు. మీ వంటి వాళ్ళకోసం రుచికరమైన లేహ్యాలూ, సువాసనకరమైన లేపనాలూ, తైలాలూ ఉన్నాయి. ఈ అజీర్ణానికైనా అంతే. మీరు డబ్బుకోసం చూడకండి. దివ్యమైన ఔషధాలున్నాయి తియ్యని రోగాలకు కమ్మని మందులు!" అన్నాడు.

బంగారయ్యకు వైద్యుడు మంచి మందులిచ్చి చికిత్స చేసి, దండిగా డబ్బు వసూలు చేసుకున్నాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

**ఈ పోటీల వ్యాఖ్యలు 1997 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.**



**K. SUBRAHMANYAM**



**MAHANTESH C. MORABAD**

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * **జూన్ నెల 15వ తేదీలోగా** వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:

చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, చెన్నయ్ - 600 026

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **కండలు కరిగిస్తే కుండలు!**

రెండవ ఫోటో : **బిందెలతో నడిపించే ఎండలు!!**

**పంపినవారు : బి. వి. ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ప్రసాద్**
**అలహాబాద్ బ్యాంక్, ఇంటర్నేషనల్ బ్రాంచ్**
**T - 4, ది ఆర్కేడ్, వరల్డ్ ట్రేడ్ సెంటర్,**
**ముంబాయి -400 005**

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00

చందా పంపవలసిన చిరునామా :

**డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్ - 600 026**

Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026 (India), Controlling Editor: NAGI REDDI.